శ్రీరస్తు.

# కావేరీచరిత్రము.

## పీఠిక.

శా. శ్రీరాగామఘసంధరాధికసుధాసేవాపరస్వాంతుఁడై
సారాచారత బోధమీరు శిఖిపింఛం బూని శ్రీపల్లెలో
నా రామామణులెల్లఁ గన్గొనఁగ నాట్యం బాడు కృష్ణుండు సు
బ్బారాయాఖ్యని వాడదేవుసలజాం బాలించి రక్షించుతన్. ౧.

చ. కలువలఱేనితోడు, గిరికన్యకసోడు, గతిసునప్ను, త
మ్ముల నివసించుకొమ్మ, కడుముద్దులు గుల్కఁగఁ బాలవెల్లిలో
వెలసిన ముద్దరాలు, కతివేలుపు నా, లిలనేలుమేటి, య
క్కలుములబోటి, పేర్మిఁ గనుఁ గావుత మెప్పడు సుబ్బరాయనిన్. ౨.

ఉ. కొండల రాచపూఁబురి, నిసుంతితనత్వ, నటించుఁ డిల్లమై
యుండుటకో! కుచంబుల మహోన్నతియుం గతనత్వమూనిపు
వండజయాన, నే గిరిశరాసనుఁడం జామియంచుఁ గేరుచున్
ఛండికఁ గోరుశంకరుఁ బజ్రనముఁ బ్రోచుత సుబ్బరాయనిన్. ౩.

చ. వనితల బారిఁ జిక్కమగవారుగలారని విందుఁగాని ని
మ్మునుబలె వేషధారియగు పూఁగుసుఁ గన్గొని మోహమంటి వెం
టను బడువారిఁ గాన నెచటన్ భళిరా! నలరాయుఁడాయ నా
దని శివుఁ గేరుశాంకరి దయం గనుఁ గావుత సుబ్బరాయనిన్. ౪.

చ. పులుగుపాలుమాయి నెక్కుదొర పొక్కిలి తామర నాగ్గుమోముల
న్వెలసి కడాని బొజ్జఁగొని నిక్కము లోకమునందు జాగువా
మలవలె నిల్చి లోకముల మానుగఁ జేయుఁ బిరించి వేడ్కఁ జే
ర్పడ్డు దయ సుబ్బరాయునిఁ జిరాయురుపేతునిఁ జేయుఁ గావుతన్. ౫.

సీ. పాలునీరేర్పఱుపంజాలిన వెలిఱెక్కపక్కి యేదేవత యెక్కురింత
చక్కరత్మెక్కియుక్కెక్కిన చదువులపులుఁ గేపాలంతికిఁ బలుకుతోడు

వెన్నెలల్వోదజల్లు చిన్నిజాబిల్లి యేచెలియకుఁ బాపట చేఁబుచుక్క-
కలిగించు మగనిమేల్ నలుతలవాకిళ్లు మెచ్చునే సకియకు అచ్చుపట్టు
లట్టి సైకతసుశ్రోణి, నజునిరాణిఁ, బరమకళ్యాణి, ఘనవేణిఁ బద్మపాణి
సిద్ధనిశ్రేణి, నవితసచ్ఛ్రేణి, వాణి, వంచితాఖిల గీర్వాణివాణిఁ గొలుతు. ౬.

సీ. పటికంపుటాలడా లటమటింపఁగఁ జాలు నిద్దంపు తెలిమేని నిగ్గులెసఁగ
సూర్యచంద్రాగ్నుల సొంపొందు మూఁడేసి కనులచాపంచ మొగంబు లలరఁ
బాపట సుతనేపు చూపులే జాబిల్లి చేఁబ్బుక్కవలె వ్రేలి చెన్నుమీర
నైదైదుచేతుల నబ్జత్రిశూలాది పరికరంబులు మహా ప్రతిభఁ దెలుప
నెల్ల వేదములకుఁ గన్నతల్లియగుచు, నెన్న మూర్తిత్రయంబునకన్న నున్న
తముగ వర్తించి నిజభక్తసమితిఁ గాచు, నఖిల విద్యావిధాత్రి గాయత్రిఁ గొలుతు. ౭.

చ. అరుణశరీరకాంతి దెస లంతరమింతయు లేక నిండుకోఁ
గరముల నాల్గిటంగళయుఁ గంజముఁ బుస్తక మక్షమాలయుం
బరఁగ శివాంకసంస్థయయి బాలికవై ఖరి భక్తకోటులన్
సురుచిరలీల నేల్త్రిపురసుందరి డెందమునం దలంచెదన్. ౮.

క. శాంతు, మునీంద్రస్వాంతని, శాంతున్, భక్తాంతరాయచయపరిశాంతున్
కాంతానంతనుతమహో, దంతు, స్మతిమంతు, నేకదంతుఁ, దలంతున్. ౯.

క. తొలిదొల్త నెవని, రసనాం, చలమునఁ గవితావధూటినవ్యగ్ఘునరీ
తుల నాట్యమాడె నక్కవి, తిలకున్ వాల్మీకిమౌనిఁ దిలకింతు మదిన్. ౧౦.

క. ఆదిం బ్రోవగు నాలుగు, వేదంబులు నేరుపఱచి పిదపఁ బురాణా
ష్టాదశకం బొనరించిన, వేదవ్యాసుని నుతింతు విశ్రుతఫణితిన్. ౧౧.

క. ఘనువాగను శాసను, ది, క్కన, నెఱ్ఱాప్రగడ, నాంధ్రకవిరాజుని, నూ
తనదండి, నహజపండితు, వినుతింతుం బాండురంగవిభు, శ్రీనాథున్. ౧౨.

ఆ. కావ్యశాస్త్రిగురుని ఘనునాగ లింగార్య, వర్యు, స్మార్తగురుని బ్రహ్మయజ్వ
పరము శ్రౌతగురుని వాజపేయాన్వయ, పాప సోమయాజిఁ బ్రస్తుతింతు. ౧౩.

క. వినుతింతుఁ గవితగురువుల, ననంతు, నన్నయ, నధర్వణాచార్యుని, భీ
మన, రంగరాజుఁ దిమ్మఘు, నుని, దాతంబట్టు, గాకు నూర్యప్పకవిన్. ౧౪.

సీ. పాపాంబికా ప్రియభర్తసర్వేశ్వర దైవజ్ఞుఁ డెవ్వాని తాతతాత
నరసాంబికా ప్రాణనాథ వేంకటసూరి తల్లజుఁ డెవ్వాని తాతతండ్రి

కామాంబికా ప్రియస్వామి సుబ్రహ్మణ్య తత్పుత్త్రుఁ డెవ్వాని తండ్రితండ్రి
వేంకట సుబ్బాంబ ప్రియుఁడు వేంకటసోమయాజి యెవ్వానిఁ గన్నట్టితండ్రి
అట్టి సీరామకృష్ణున కగ్రజుండు, శ్రోత్రి, సవధానవిద్యావిశారదుండ
గౌతమీ మహాత్మ్యాది సద్గ్రంథకర్త, కృతి విశదకీర్తి, శ్రీపాద-కృష్ణమూర్తి. ౧౫.

తే. ఆంధ్ర గీర్వాణభాషల నభ్యసించి, గురుకటాక్షంబునను నేర్చు కొలఁది నీశ్వ
రార్పణంబుగ నే త్ర్యమహాప్రబంధ, ములఁ బూనితి దయఁ జూడరయ్య కవులు. ౧౬.

చ. అరసియుఁ జేసెదం గృతినటంచుఁ బ్రమాద మదెంతవారికే
నిరవగుఁ గాన నిం దెచటనేని యొకానొక తప్పుగల్గినన్
నిరసనమాడినం దెగడ నీతియొకో సుకవీంద్రులార, నే
ర్పరి వడిగట్టినం జెఱకుపానకమందున నల్కులుండవే. ౧౭.

క. భువిలక్షణవతియగు మ, త్కవితా కన్యక రసజ్ఞతతిమాత్రము మె
చ్చ వెలుఁగు నెడమూఁగల మదిఁ, దవులక గీతంబుదనరదా! తలపోయన్. ౧౮.

ఆ. కరుణ నస్మదీయ కవితార్ణవంబునఁ, దప్పునొప్పు నరసి తప్పువిడిచి
యొప్పుదుచుల నానుఁడో బుధవరులార, వినము పిడిచి సుధను మెసవు కరణి. ౧౯.

మ. ప్రకటింపంబడు మంచిచెడ్డ యనుచు న్వర్తించి చర్చింప న
ట్టకలంకంబగు కబ్బముం గనుచు దోషాపాదనల్ సేయు న
క్కుకవుల్ గ్రాందలు గల్గఁ బట్టి కవికిం గొల్లాటమౌఁ గీర్తి త
క్కక నగ్గాట నుపాయకారులని వేడ్కం జూచెదన్ వారలన్. ౨౦.

వ. అని యిష్టదేవతాప్రార్థనాదికంబు బొనరించి మించినవేడ్క నొక్క మహాప్రబంధం
బొనరింపం దలంచియున్న యవసరంబున. ౨౧.

సీ. ఆసేతు సీతాచలావృతంబగు యశం బార్జించెనే దాతయన్వయంబు
దేశపాండ్యాలయి దేశంబు లేలిన ప్రభువులే మంత్రీంద్రు వంశభవులు
వైదికాచారసంపత్తి సంస్తుత్యులై యిరవొందు నేతాళ్యవరుని యింట
రాజసంస్థాన విరాజమానాభిఖ్యుఁడగు కృష్ణరాజే గుణాఢ్యుతండ్రి
అతఁడు పెంపొందు సూర్యనారాయణావ, రజుఁడు గ్రంథావలోకనరతుఁడు సుకవి
హితుఁడు నవనీతమృదుతర హృదయుఁడఖిల, మాన్యగుణపాళి సుబ్రాయమంత్రిమౌళి.

వ. అట్టి దొక్కనాఁడు భృత్యసహితుండై నిజమాన్యక్షేత్రంబు లరయం బయలువెడలి
గోదావరీమండలంబునందలి మా గ్రామంబున కరుగుదెంచి మాయింటన విడియించి
రాత్రి భోజనానంతరంబున సుఖాసీనుండై నావృత్తాంతంబంతయు నంతకుమున్న విన్న

వాఁడు గావున నన్ను రావించి మన్నించి చెంతం గూరుచుండంబెట్టుకొని వినయంబు
నం బొగడుచు నిట్లనియె. ౨౩.

చ. మును నినుఁ గూర్చి నీకవితయుం గురియించియు నీమహావధా
నని పుణతం గురించియు ఘనంబుగఁ బెక్కుసభాస్థలంబులన్
వినివిని నీలసత్కృతులనేఁ బఠియించి పఠించిలో నినుం
గనుఁగొన సంభ్రమం పడి తగం జనుదెంచితి నీదు చెంతకున్. ౨౪.

క. అవధానగతు లనేకము, లవు చాతుర్విద్యకవితమవు నీవశమై
కవిరాజ బిరుదమందఁగ, భువి నిప్పుడు నీక చెల్లుబో! కవిచంద్రా. ౨౫.

క. భావముకలిమి నతిరస, స్రావంబై నీదు కవితద్రాక్షాపాకం
బై విన రుచియించుఁ జుమీ, శ్రీవేంకటసోమయాజికృష్ణకవీంద్రా. ౨౬.

తే. తరుతటాకాది సప్తసంతతులలోన, ఖిలములేక ప్రశస్తిమైఁ జెలఁగునట్టి
యది కృతియకాన నొక కృతియస్మదంకి, తంబుగాఁ జేయు మాశీఃపరంబుగాఁ. ౨౭.

వ. అని సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలాంబరంబు లొసంగిన నంగీకారంబునం
బుచ్చుకొని ముదమంది ముందు మంగళాచరణంబుగా నమ్మంత్రివరుని వంశావతారం
బభివర్ణించెద. ౨౮.

సీ. శ్రీరమణీమణీ జీవితేశ్వరునాభి సరసిజమే స్వామిజన్మభూమి
తలవాకిళుల మెల్గఁగలిగి లోకము లేలుతరళాక్షి యే వేల్పు ధర్మపత్ని
క్షీరనీరవిభాగమారసి చేసెడు పక్కియే దేవర యెక్కిరింత
దేవ మునీంద్ర దేదీప్యమా నిక్కంపుజగమే మహాత్ముని తగినసెంకి
అతఁడు నలువొంగు శ్రీకాయజాగ్రజుండు, బ్రదుకు పొద్దులనుదిటిపై వ్రాయువేల్పు
వేల్పులకుఁ బెద్ద వెలిదమ్మి వెలుఁగుమేటి, పలుకుతోఁడు దొసఁగుగాలి చిలువ, నలువ.

శా. ధన్యాత్ముండగు నప్పితామహునకుం దర్కించుమాత్రంబునన్
సన్యస్తాఖిల దోషుఁ డూర్జితయశస్సంపాదకుండున్ జగ
న్మాన్యుం డీశ్వరభక్తి తత్పరుఁడు శ్రీమౌద్గల్యనాముండు లో
కాన్యుం డొప్పు మునీశ్వరుండు ఘనుఁడై యాలోమనఃపుత్త్రుఁడై. ౩౦.

తే. ఆ మునీంద్రునిగోత్ర రత్నాకరమున, లచ్చితోఁబుట్టువులు సత్కళానిధులు వి
బుధులు సర్వజ్ఞమౌళులు పూర్ణయశులు, వెలసి పెక్కంద్రు ద్విజరాజులలరిరుర్వి. ౩౧.

చ. ధరిణి సమానవృత్తులముదంపడు బ్రాహ్మణులెల్లఁ గారణాం
తరమున మాటిరెన్న ద్వివిధంబుగ నందునఁ బెక్కు రొప్పి నా

దరతరవైదికంబున నియోగమునం దగిరాజు వేలుభూ
సురులది గాన నత్తెగకుఁ జొప్పడెఁ జేరపుడాలు వేలువాఁడా. 3౨.

తే. ఆల్లమాద్గల్యగోత్రజులందుఁ గొంద, ఱాఱు వేల నియోగులయందుఁ గలసి
యోడయాడురేవునను మున్నుంటఁ జేసి, యోడరేవువారను పేరనొప్పుచుండ్రు. 33.

క. అలయోడ రేవుకులభవు, లలఘు గుణాన్వితులు శంకరారాధన చి
త్తులు భూరిదానకల్ప, ద్రుమలు సత్యపరాయణులు విధూతాఘచయుల్. 3౪.

తే. వారిలోపలఁ బెక్కండ్రుపరుసఁ జనిన, యవలసోమ మంత్రియనంగనయ్యె నొక్కఁ
డతఁడు బాల్యమునం దోశయాత్రగా ప్ర, వాహమందునఁ బడె నైపవశముఁ జేసి.

క. ఇట్టులు వెల్లువలోఁ బడి, కొట్టుకొనుచు పోవువానిఁ గూనను గని యా
పట్టునఁ దపస్వియొక్కఁడు, గట్టునకుం గొంచువచ్చెఁ గరుణాళుండై. 3౫.

వ. ఇట్లు కొనితెచ్చి తనయుటజంబునం బెట్టికొని పెంచి పెద్దవానిం గావించి కులకర్తం జేసి తాను గులగురుం డయ్యె. అదిమొదలాకులంబు వారు ప్రబోధానందతీర్థస్వామి యను నాపరమహంస శిటికనిం గొలుచుచుందురు. ఆ సోమమంత్రి కవ్వలఁ గొంద అమాత్యశేఖరుల యనంతరంబ. 3౬.

తే. ధైర్యఖని కృష్ణయాఖ్యుఁ డవార్యశౌర్య, ధుర్యుఁ డర్థార్థికల్పకంబార్య నుతుఁడు
సకల సత్కవీశ్వరలోక సన్నుతుండు, వెలసి పేరు ప్రతిష్ఠయుఁ జెలఁగఁ బరఁగె.

ఆ. అతఁడు బాపనమ్మయను సతీతిలకంబు, నందుఁ గనియె సీతనాఖ్యపుత్త్రి
యుగముఁ జెలమయాఖ్యు నొకనిఁ బ్రదిమాస్తుల, నత్రిమానికన్న యట్లమున్ను. 3౮.

క. అందుఁ జెలమయాఖ్యుఁడు జను, లందఱు వినుతింప శాశ్వతైశ్వర్యములం
బొంది యపను ఘనుఁడై తగెఁ, బొందుగ శ్రీపసలపూడిపురవరమందున్. ౪౦.

సీ. తన ధనత్రయమంత ధర్మకార్యంబులయందు నేకాని వేఱొందు లేదు
తనయసత్యంబంత మునిప్రాణరక్షణమందు నేకాని వేఱొందు లేదు
తనయసహ్యంబంతయును బాపకష్టులయందు నేకాని వేఱొందు లేదు
తనదూషణంబంతయును బరోభాగులయందు నేకాని వేఱొందు లేదు
తన దురాలోచనంబంత తద్దయుఁ బర, దారగమనం బొనర్చెడు క్రూరజనుల
యందు నేకానిమఱియు వేఱొందులేదు, నాఁగఁ బొగడొందెఁ జెలమయనాముఁడతఁడు.

చ. అరయధనాఢ్యుఁడౌ చలమయాహ్వయుఁడు త్తరుఁ డచ్చమాంబయున్
గరితఁ గులాంగనామణిగఁ గైకొని వేంకటరాయఁ గృష్ణయ

స్వరమతి సుబ్బరాయుని ఘనంబగు వేడుకఁగూర్చు మువ్వురన్
వరసుతులం గనెం గవులు వర్ణనచేసెదు వైభవంబునన్. ౪౨.

ఆ. అల్ల సోదరత్రయంబు త్రేతాగ్నులు, నా త్రిమూర్తులనఁ ద్రినేత్రములనఁ
త్రిభువనంబులనఁగఁ ద్రిగుణమ్ములనఁగఁ ద్రి, సంధ్యలనఁగ జగతి వినుతిఁ గొనియె. ౪౩.

క. ఆమువ్వురు మంత్రివరుల, లోమహిమంగృష్ణరాజలోకోత్తర స
న్నామునుఁడు సన్నుతసుగుణ, స్తోముఁడు దనరారు సుకవిశుభవర్ణితుఁడై. ౪౪.

సీ. ఎవ్వాని దాతృత్వమిలలోనశిబికర్ణముఖ్యుల కీర్తినిఁ బుడికికొనియె
నెవ్వాని ధైర్యంబు హిమశైలభర్తతో నెదిరించి లోకమం దెనకెక్కెఁగు
నెవ్వాని గాంభీర్య మెన్నఁ బారావారములఁ గలగించి పెంపును వహించు
నెవ్వాని శేముషి యింద్రాది సురగురువరునితో నెదిరించి పరఁగుచుండు
నతఁడు నలువొందు వాడరేవన్వవాయ, కలశసాగరపూర్ణ రాకానిశాక
రుండు, పరమపావన విగ్రహుండు, చలమ, యాత్మజుఁడు, చినకృష్ణరాజాహ్వయుండు.

సీ. ధరదధీచిని దాతదాతయంటయె కాని దిమ్మింద్రునకు నీయ నింతడొంకె
ధైర్యంబునను హిమధరము నెన్నుటె కాని విఱిగి నీరగు భావమెఱుఁగనయ్యె
గాంభీర్యమున నెప్పుఁ గలశాబ్ధియనె కాని మున్నీటి కమ్మాట పొసఁగియున్నె
మతిచమత్కృతి బృహస్పతి యెన్నఁ గాని చెడిపె పెండ్లాము చేఁ జెడి మొఱపడె
గాన నొక్కొకగుణమందు ఘనతఁ గాంచి, యుండు వారికైనఁ గొలంతలుండుఁగాని
సకలసద్గుణములను బ్రశక్తిగాంచి, కొమరు మిగులు కృష్ణున కెందుఁ గొఱంత లేదు

క. ఆతనికిం జాయామణి, యై తగ వేంకటరమణమయనెడు పరమసా
ధ్వీతిలకమలికలోచనుఁ, జేతోమోదమునఁ జేరు చెలియబుధుడుగన్. ౪౭.

సీ. చాపలంబునఁ బెర జనుఁ జేర నొల్లని మంగళదేవి యీమంగళాంగి
బలురాగయై నొల్లఁ బడి రచ్చలెక్కని మంజులవాణి యీమంజువాణి
మగనిసామేనఁ బ్రొఁ జెగి గద్దరింపని మృగరాజగమన యీమృగపరాక్షి
పాటిఁ జెప్పినఁ గాని మాటాడఁ దలఁపని విబుధేంద్రదేవి యీవిబుధదేవి
అనుచు నెల్లరుఁ గొనియాడఁ బ్రాణనాథు, నెదవసించియువాక్కానమెలమిగొనియుఁ
గలసియును ననువర్తనముల నిలిచియుఁ, గొలుచు వేంకటరమణాంబ, గుణకదంబ.

మ. అలశ్రీకృష్ణమరాజమంత్రిరమణాంబాబ్జాక్షి, సుద్వాపరా మై
జలధిప్రోద్భవఁ గూడిమాడి సుఖతన్ జానొందు కృష్ణుండు నాఁ

జెలఁగం గోత్కులు గాంచెఁ బుత్త్రియుగముఁ శ్రీసూర్యనారాయణుఁ
విలసత్కార్యుని సుబ్బరాయుని జగద్విఖ్యాతి సంధిల్లఁగన్. ౪౯.

వ. మఱియు నావాడరేవు చినకృష్ణమరాజమంత్రిరత్నంబు వేంకటరమణాంబాసతీరత్నం బునందు, రత్నమ, అప్పమ, అమ్మన, వేంకమ, శేషమ, బాలాత్రిపురసుందరి, సూరమ, అను పుత్త్రికారత్నంబులనుం గాంచి తరుగని పాడిపంటలం బరఁగు సిరితోఁ దులఁ దూఁగుచుం గులకర్త యై దేవేంద్రవైభవంబునం దేజరిల్లె ఆ స్త్రీపురుషసంతానం బాయురారోగ్యైశ్వర్య పుత్త్రపౌత్త్రాభివృద్ధిం బరఁగుచు నాచంద్రతారార్కస్థాయి యగుఁ గాత మందు. ౫౦.

స్రగ్విణి. సూర్యనారాయణస్తోత్రపారాయణుం
డార్యపూజారతుం డర్థిరాశీయుఁడై
శ్వర్యదేవేంద్రుఁ డాశ్చర్యధీసాంద్రుఁడా
సూర్యనారాయణుం డిద్ధిదేవుండగున్.

చ. అతఁడు విభాకరుండు తమమాతయడంచి వెలుంగు మిత్రుఁడై
యితఁడు ప్రభాకరుండు తనమింతయడంచి వెలంగు మిత్రుఁడై
యతఁ డితఁ డొండొరుల్ ప్రతిపనందిన సూర్యులు పోల్పవారి యం
స్నతి నుతియింప శక్యమగునా! మముఁ బోటి కవీంద్రకోటికిన్. ౫౨.

ఆ. సూర్యతేజుఁడల్ల సూర్యనారాయణ, మూర్తికవరజుండు, కీర్తనీయ
పుణ్యమూర్తికృష్ణమూర్తిమిత్రుండొప్పు, రాజమాన్యసుబ్బరాయమంత్రి. ౫౩.

సీ. ఎవ్వాని నోటిలో నెపుడు సరస్వతి నాట్యంబు లాడెడు నలువుమీర
నెవ్వాని బొజ్జలో నిమిడి సద్గుణజాల మావాసమొనరించు ననుదినంబు
నెవ్వాని చేతిలో నెల్లకాలంబును దాతృత్వము వసించి ఖ్యాతిగాంచు
నెవ్వాని కన్నుల నిరవొందు నితరుల సిరిఁజూచి తగ సంతసించు గుణము
అతఁడు నలువొందు సభినవప్రౌఢ్యృత మృదుతర, విమల నవనీత సమచిత్తుఁ, డమరగురుస
మానసమధికమతి, యభిమాన, ఘనుఁడు, రాజరాజమాన్యుఁడు సుబ్బరాయమంత్రి.

క. క్షితి సుకలుండగు నాతం, డతులిత కరుణాసముద్రుఁడని యెల్లరకున్
సతతము విదితవిషయమా, వితమేవన విన్నదాని వినిపించుటయే. ౫౫.

సీ. ఎంతకాలంబు దిగ్దంతిసంతతి వ్రోడఁ దిరమై వసుంధర బరఁగుచుండు
నెంతకాలంబు తారేశది నేశాది ముఖ్యగ్రహంబులు పొనరుచుండు

నెంతకాలము ప్రజాసృష్టిచేయుచుఁ బరమేష్ఠి నిశ్చలతమై మెలఁగుచుండు
నెంతకాలంబు దేవేంద్రాది దేవతావారంబు నిచ్చమై వరలుచుండు
అంతకాలంబు వాడరేవన్వవాయ, సుబ్బరాయుఁడు సత్కవిస్తోమగేయుఁ
డాయురారోగ్య పుత్త్రపౌత్త్రాభివృద్ధిఁ, దనరుచుండెడుఁ గాత భూతలమునందు.

## షష్ఠ్యంతములు.

క. ఏతాదృగ్వైభవ వి, ఖ్యాతమహీసురవరాన్వయ రాకా
సీతఘృణికి, రమణాంబా, పూతోదరశుక్తిసక్తముక్తామణికిన్. ౫౭

క. పౌత్త్రునకుం జినకృష్ణను, పుత్త్రునకున్ సర్వదేశబుధమిత్త్రునకున్
సూత్రజ్ఞానవినిర్జిత, శత్రునకున్ సూరివినుతచారిత్త్రునకున్. ౫౮

క. ధీరజనవిధేయునకున్, ప్రారంభితదానవిజిత రాధేయునకున్
సారాంచితకాయునకు య, శోరాజద్వాడరేవుసుబ్రాయునకున్. ౫౯

వ. అభ్యుదయపరంపరాభివృద్ధి యగునట్లీకావేరీచరిత్రం బాశీఃపూర్వముగు కృతిగా నొసఁగఁబడి సఫలీకరింపఁబడియె. ౬౦

శ్రీ

# కావేరీచరిత్రము.

---

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీయుక్తవిధియాసక్తప్రకృతిం దంజేరం ద్రిమూర్త్యాత్మకం
డై యేరీదు జగంబులం గలిగి నిజప్రాప్తింప్రజాలోదయో
పాయప్రక్రియఁ బెంచఁ ద్రుంచఁ గలిగింప న్గర్తయై సర్వత
స్స్వేచ్ఛ మత్తేజమున న్విభించు నా సర్వేశ్వరుం గొల్చెదన్. ౧.

## కథాప్రారంభము.

అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కావేరీచరిత్రంబను మహాపురాణంబునకుం గథాక్రమం బెట్టిదనిన; నైమిశారణ్యపుణ్యక్షేత్రనివాసులగు శౌనకాది మహర్షులు హర్షోత్కర్షంబున ద్వాదశవార్షికోత్తమసత్త్రయాగంబున సమాసీనుండగు సూతునర్చించి, తన్ముఖంబున గంగామాహాత్మ్యవిశేషానేకానవద్యపురాతన పురాణేతిహాసంబుల నాకర్ణించుచు, నొక్కనాఁడు కావేరీమాహాత్మ్యశ్రవణకుతూహలాయత్తచిత్తులై విన్నవించిన నక్కథకుండు స్కాందపురాణంబునం బ్రబలి, యుమామహేశ్వర సంవాదాత్మకంబై, కలికలుషనాశనంబై, భుక్తిముక్తిప్రదాయకంబగు నక్కథ యిట్లని చెప్పందొడంగె. ౨.

శ్రీరమణీయమై సుగతిఁ జేర్పఁగఁ జేర్పడుమంచిదారి, పా
పాదుల పెక్కుమారి, పరమామలసహ్యకుమారి, సింధుదే
వేరి, సమాత్తశౌరి, జనవిశ్రుతనిర్మలపుణ్యవారి, కా
వేరి, వసుంధరం బొలుచు వేగతులం గవివర్ణనీయమై. ౩.

గంగ, గౌతమి, యమున, సరయువు, గండకి, నర్మద, తుంగభద్ర, కృష్ణవేణి, యఘనాశని, వేత్రవతి, చంద్రభాగ, కపిల, తాపిని, దేవ, సుప్రభ, సీత, తామ్రపర్ణి, మలాపహ, హేమావతి, వేగవతి, వరణ, ఫల్గుని, యసి, లోనగు పాపాపహంబులగు నదులన్నియు నీకావేరీనదికి సరిరావనిన, సంశయాయత్తచిత్తులై మునిసత్తము లిట్లనిరి. ౪.

చ. నదులకు నెల్ల మేటియయి నల్వగుగంగయటంచు నెంచి ము
న్విదితముగాఁగనీగురుఁడునీవునుఁజెప్పఁగవింటి మిష్టహో!
యిదియధికంబటంచనుటయెట్టిది ? యియ్యెడసందియంబుమా
మదులనుబుట్టెదాని నెటుమాన్పెదొ మాన్యవెసూత! నావుడున్. ౫.
తే. రోమహర్షణియిట్లను సోమునీంద్రు। లార, మీసంశయచ్ఛేదకారణం, బు
మామహేశ్వరసంవాద, మాయయాప। హము, పురాతనమితిహాసమలరువినుడి.
మ. మునుఁగైలాసనగంబునందమరసంపూజ్యున్, దయాప్రాజ్యుని,
న్వినతాజున్, ధ్రుతిరాజు, రాజితతనున్, సింహాసనాసీనునిన్
సనకాద్యుత్తమసేవ్యమాను, శివునిన్, వామాంకపీఠస్థయై
కనికేల్మోడిచి, సర్వమంగళయనుం గౌతూహలంబొప్పఁగన్. ౬.

పార్వతీపరమేశ్వరసంవాదము.

క. విననిచ్చవచ్చెశంకర, వినిపింపుక వేరజానువృత్తాంతంబున్
ఘనతీర్థవైభవంబుల, ననవుడునతఁడిట్టులనియెనతికుతుకమునన్. ౭.
వ. దేవీ, కావేరీమాహాత్మ్యం బత్యంతపాపాపహంబు చెప్పెద దత్తావధానవై యా
కర్ణింపుము. ౮.
సీ. కలదవాగ్దిగ్భూమితలమున దివికండ సహ్యమనేపేరఁటఁజనెడుకొండ
వఱలుఁదచ్ఛృంగంబు వరబ్రహ్మగిరినాఁగ బ్రహ్మర్షులేడ్వురు ప్రబలియుంటఁ
బోలుచునగ్గిరిపార్శ్వమునయంబుఁగావేరి మూర్తిత్రయాంచితపుణ్యవారి
కడఁగునచ్చటఁగనకానది గవుఁబేర్చికదలుఁగా వేరిసంగమముఁగూర్చి
కడఁగునెచ్చటనానందకందుఁడగుచు, స్కందుఁడనురక్తి వెలుగొందుసంతతంబు
నానదులయంతరాళంబునందుస్కంద, వనమనఁగనొక్కక్షేత్రంబుఘనతరఁబు. ౧౦.
తే. మనకుమారుని మెప్పించె ఘనతపంబు, నొనరిచిభగండుఁడనియెడునొక్కమౌని
యచటఁజేసినదింతయేనంతయగుచుఁ, బ్రబలునలస్కందశిష్యులవరుసగరిత. ౧౧.
వ. పూర్వాపరసముద్రగాములగు గంగాదిపుణ్యనదులీకావేరీప్రభావంబున గతకల్మషలై
వర్ధిల్లుచున్నవనిన విని భవానిభవున కిట్లనియె. ౧౨.
ఉ. మును భగీరథుండతఁ డఖండితతపం బొనరింప ధాత్రికిం
జనిమునిశాపదగ్ధులగుసాగరులందనరించి, పుణ్యముల్
జనులకునించి, సర్వమునిసన్నుతయయ్యెనుసంగుగంగతోఁ
జనునెనమానమున్గొలుప? శంకర! తక్కునలంతివాఁకలన్. ౧౩.

సీ. నివసించు నెచ్చటఁ ద్రవరూపమున సర్వగతుఁడై జనార్దనుం డతులితముగ
దీపించు నెచ్చటఁ దీర్థరాజం బయినట్టి ప్రయాగంబు నజునితోడ
వెలుగొందు నెచ్చట విశ్వేశ్వరాఖ్యుఁడై చచ్చువారికి మోక్షమిచ్చు కాశి
పాలుపొందు నెచ్చటఁ బుష్కరాదులు పుణ్యమైన తీర్థములు కోటానకోటు
లట్టి గంగానదికి సాటి యెట్టు వచ్చు, వరుణ కావేరియును సరస్వతియు యమున
లోనినదు లెల్ల నలతులం చేను వింటి, సవసవగ మీరు వినిపింపఁ జంద్రమకుట. ౧౪.

ఇదియునుం గాక మున్ను మీరు నాకెఱింగించిన యర్థం బొండుం డెనది యెట్టిదనిన; సత్యలోకంబున హిరణ్యగర్భుని వామాంకస్థితయగు సరస్వతి గరువంబున సర్వశుభ లక్షణలక్షితయగు జాహ్నవిం దిరస్కరించుటయు నామె కోపంబు పురస్కరించుకొని, వైశారద్యంబున శారదం జూచి సోపాలంభనంబుగా నిట్లనియె. ౧౫.

గంగ సరస్వతిం దిరస్కరించుట.

ఉ. విడుమి మనంబులోన నవివేకపు గర్వము సూ సరస్వతీ!
చెడెదు హిరణ్యగర్భు నెడఁ జేరితి నంచును విఱ్ఱవీఁగకె
య్యెడకును నన్నుఁ జూచి కలహింపకు నాకును నీకు హెచ్చు కుం
దడరెడు స్త్రీలయందు నదులందు నముఖ్యవు నీవు చూడఁగన్. ౧౬.

ఉ. కోమలి! నేను మేశ్వసనకుం గడుఁగూర్చుచుదాన, వాకలం
గోమలులం గడుం దనరు కోమలదేహ, యశోవిరాజితన్,
భూమి సమస్తభక్తులకుఁ బూర్ణధనం బిడి పుణ్యలోకముల్
ప్రేమనొసంగుదాన ననుఁ బేర్కొనఁగాఁ దగ వీవు పొమ్మికన్. ౧౭.

క. సతి, యాత్మస్తుతి యతిగ, ర్హితమగుఁ గావున వచింప నెగ్గగుటను మా
నితిఁ గానినాకుఁ బాలిన, సతి యొక్కతి జగమునందుఁ గను నే? చెపుమా. ౧౮.

ఉ. ఎఱుఁగమె నిన్ను మున్ను గుణహీనత మానిసిఁ గూడి మాడుటల్?
చుఱచుఱమండుచుఁ గోపమునఁ జూచి విరించి శపించె నందునన్
దెఱలి యశంబు దృశ్యవు నదృశ్యవునై నదివై చెలంగవే!
మఱచితె పూర్వవృత్తమును? మానిని! సిగ్గది యెందుఁ బోయెనే! ౧౯.

మ. మగఁడు చతుర్ముఖుండను చుమాను మెదన్న రువంబు సంపదన్
దగుమగవారు కాముకు నదాదుల నెనియుఁ బత్నులట్లయిం
ఖగ నాడ వేడిఁ జూ డెద్ద రోశప్పడుఁ బత్నుల నేనిదాదుల
క్లెగఱఁగ నింపు పిడెద రికెమియు నీమది నెంచి చూడవా? ౨౦.

మ. పురుషుల్ కృత్రిమబద్ధసఖ్యులుమనంబుఁజూఁచిమాటాఁడరె
త్తఱిఁగాపట్యముతోడలేనిదయలందర్శించుచున్వేఁడిక
ర్కృఱుతుల్దీరినవెన్కవారువిదలన్గోరంతయుండల్పరీ
గరువంబింతటిదానికింతతగునే ? కాంతా ! విచారింపవే ? ౨౧.

తే. లాలనముచేసికాంతలనోలిఁగూడి, తారవిడుతురు నిమిషమాత్రంబులోన
నన్యకాంతలఁగోరెదరవనియందు, నమ్మరాదమ్మ ! మగవారినైజగుణము. ౨౨.

వ. అని దూఱనాడి యనుగ్రహంబున. ౨౩.

చ. కినుకకుమాఱునాకుఁగలిగెందయనీపయి, నేనుసర్వపూ
జ్యను, గిరిశోత్తమాంగకలితాశ్రయ, నాశ్రితభక్తలోకస
ద్వనరుహసంకటాపహ, నివారితకల్మష, లోకపావనిన్
జనని, సందియంపడకనన్నెదవేఁడువరంబులిచ్చెదన్. ౨౪.

వ. అనిన గంగమాటలువిని లేఁటమోమువడి సరస్వతి పితామహుని దిక్కుమొగంబై
యిట్లనియె. ౨౫.

ఉ. వింటివె ! ప్రాణనాథయిదె, వేయుఁదెఱంగులఁబొంగిగంగనన్
గెంటసమాఁడెనీయెదుటనిండినయీసభలోననెల్లఱున్
గంటకమావహించివినఁగా వినినీవునదేమొ పూనమి
ట్లుంటఁగనూరకుంటివిదిన్యాయమె ! నాయెడనెగ్గుదోఁచెనే ! ౨౬.

చ. అనుడుఁజతుర్ముఖుండనునహో ! సుర ! దీర్ఘికయింతయొప్పునే !
తనుఁదెగనాఁడునీకువరదానముసేయఁగనుండెనద్దిరా !
మనమునఁనెన్న నీనదికిమాఱుగనేరులుగీరులొప్పునే !
వనితరో ! నిర్గవో వరముచారకకోరు శుభప్రదంబుగన్. ౨౭.

వ. అనిన నాపె కోపలజ్జాకులచిత్తయై మగనిందెగడి, కొలువుకూటంబుఁదొలఁగవిడిచి
తానెట కేనియుం బోయెనని వింటి. దీనంజేసి నదీశ్రేష్ఠయగు సరస్వతికన్న గం
ఘనంబని తెలుచున్నయది. దాని కాకావేరియెట్లుసరివచ్చుంజెప్పుఁడనిన నప్పరమే
శం డిట్లనియె. ౨౮.

తే. ముదితరో, సరస్వత్యాదినదులకెల్ల, గంగశ్రేష్ఠంబునతభక్తకల్పకంబు
దానికెనయైననదియొండుధరణిలేదు, పట్టియాలోచనముసేయఁబనియులేదు. ౨౯.

వ. అది యట్లుండనిమ్మాయాదిమాయయగు కావేరి లోకనాథప్రార్థితయై యతనికిఁ బుత్రి
త్వంబును, మదంశసంభూతుండగు నగస్త్యునకుఁ బత్నీత్వంబునుం బొందె. తీర్థ

రావారమధ్యంబునందుంబలె శ్రీరంగశాయియందుఁ బొందుగ నధివసించు. మదీయ దివ్యలింగచిహ్నితంబులగు పరమక్షేత్రంబులును ద్విపుష్కరాదులు తీర్థంబు లుభయ తీరంబుల ననేకశతసహస్రంబులు దేదీప్యమానంబులగుం గావునఁ గవేరతనయ సర్వోత్కృష్టయని, నిస్సంశయంబుగం గొనియాడంబడునని వెండియు. ౩౦.

దేవీ, నానుడివమ్ముసత్యమువిధాత్రబ్జవిష్ణ్వాదిస
ద్దేవౌఘంబుననేను, శ్రీప్రముఖసద్దేవీసమూహంబునం
దీవుంజాహ్నవిలోనిదివ్యనదులన్ వీక్షించిపోలింపఁగాఁ
గావేరీనదియొప్పలేదుపరినల్కుం దేనిఁజర్చింపఁగన్. ౩౧.

అనవిని సంతసించి, జగదంబత్రిలోచనుఁజూచి, యిద్ధస
న్మునిజనమైనస్కందవనముం గిరిసహ్యము ద్రష్టుకామనై
వినయముఁజూపశంభుఁడునదీసపర్యారసమావహిల్లన
ట్లనెయనిపార్వతీసహితుఁడైచనఁగామతిఁజేసెనంతటన్. ౩౨.

## పార్వతీపరమేశ్వరులు సహ్యాద్రికివచ్చుట.

శ్వేతచ్ఛత్రమువట్టెశౌరి, విధియున్వింజామరల్వీచెసం
ప్రీతుండైపురుహూతుఁడాభరణముల్వేట్టెన్మునుల్వేఁడఁజెన్
భూతంబుల్దనచుట్టువారవృషభంబుంగాంతత్తోనెక్కియా
భూతేశుండుప్రయాణమయ్యెఁగడుకన్ బ్రోలంబ్రవర్తింపఁగన్. ౩౩.

ఇట్లుఖండవైభవంబునం బయనంబై కదలి, శంకరుండు సహ్యాద్రికరిగి, యట నొక యశోకతరుపార్శ్వంబున నానందీశ్వరు నవరోహణంబుచేసి, పార్వతికప్పరమేశ్వరుం డప్పర్వతవిశేషంబులం గరాంగుళీసంజ్ఞం జూపుచు నిట్లనియె. ౩౪.

ఇదిమదీయము పుణ్యపదము క్షిదముమూలస్థానమీక్షింతె? లలన, నీవు
ఇదిస్కందవనమిందుఁబాదలుస్కందుండుపుణ్యప్రదుండేక్షింతె? యతివ, నీవు
ఇదియగస్త్యాశ్రమమిదిశ్రీభగండేశముత్తమమీక్షింతె? యువిదనీవు
ఇదితక్షకవనంబునిదియుప్రాచీశారణ్యమనవొప్పనీక్షింతె? వనితనీవు
ఇదిహంతాళనపర్వతమిదియేకవక, యిదియొసప్తర్షిజనపదమిదియొసహ్య
బిందియొకావేరియిదికవేరతపభూమి, యిదియొబ్రహ్మాద్రివీక్షింతె? సుదతి, నీవు. ౩౫.

అని మఱియు ననేక పుణ్యాశ్రమంబులంజూపి, కావేరీమాహాత్మ్యం బభివర్ణించుచు వెండియు. ౩౬.

శా. కాంతా, సహ్యనగంబునుండిడిగు నిక్కావేరి వీక్షింతె? శ్రీ
కాంతుండింపున నాణిముత్తెములతోఁ గట్టం బ్రకాశించు పే
రింతం తౌనురమందుఁ దాల్చె ననఁగా నిప్పట్టునందోఁచి నా
కెంతో సంతసమయ్యె నుల్లమున నీకెట్లొప్పునో? చెప్పుమా? ౩౭.

చ. అనవుడు నార్య యిట్లనియె నార్య, గిరీంద్రముచుట్టి పాఱునీ
ధునిగనవయ్యె భూవనితతోఁ గపు నీలము మగ్వఁ జేర్చి కూ
ర్చినను సోగహారమును జెల్వొనిచిత్తము పల్లవింపఁ జే
యనుధరియించెనో? యనెడునట్టి విధంబున నయ్యె నియ్యెడన్. ౩౮.

వ. అనంతరంబ శంకరుండు. ౩౯.

తే. కలికి, కావేరితోఁ గనకాస్రవంతి, కలసినట్టిచోఁ దీర్ఘంబు గలిగె దివ్య
మల్లగంగయు యమునయును దుకుచోటి, కన్న శతకోటిగుణపుణ్యమెన్న నిడుచు. ౪౦.

క. ఇలలో స్కందవనంబున, కలరె భగండప్రదేశమను పేరిపుడో
జలరుహగంధీ, వినుమీ, స్థలమున నీరాడువాఁడు సద్గతి వడయున్. ౪౧.

వ. అనినం బార్వతి యిట్లనియె నో ప్రాణేశ్వరా! స్కందవనంబునకు భగండక్షేత్రమను పేరెట్లుత్పన్నంబయ్యె? కావేరి యెవ్వనికూఁతు? రెవ్వని దేవేరి? యేల నిచ్చటికి విచ్చెసె? కనకానదీవిధం బెట్టియది? యదియంతయు సవిస్తారంబుగా నెఱింగించుమనిన నష్టహాత్ముండు. ౪౨.

## భగండక్షేత్ర వృత్తాంతము.

చ. కలఁడు భగండుఁడన్ముని శిఖామణి, ధర్మపరాయణుండు, ని
శ్చలమతి పూర్ణుఁడుం, బరమశాంతుఁడు, భూతహితుండు, సత్యవా
క్కలితుఁడు, నైష్ఠికుండు, గతకాముఁడు, ధర్మరతుండు, వేదపు
ష్కలుఁ, డనసూయుఁడు, స్వజనసమ్మతుఁ, డొక్కఁడు మున్వసుంధరన్. ౪౩.

క. ధాత్రీగ్రామాధిపుహరి, ధాత్రీసురుఁడతఁడు గొల్చి తగవిజ్ఞాన
క్షేత్రంబను స్తోత్రంబుల, ధాత్రీస్థలిఁ బేరుపొంది తద్దయుఁ దనరెన్. ౪౪.

వ. అంతనతండు కొంతకాలంబున కీస్కందవనంబున కరుగుదెంచి, దృఢవ్రతుండై, చిరకాలంబు తీవ్రతపంబొనరించె. అత్తపంబునకు నమందానందకందళిత హృదయారవిందుండై, స్కందుండనుగ్రహించి, తదనుమతిం దనవనంబతనికొసంగె, నది మొదలు మునులీ బాహులేయారణ్యంబునకు భగండక్షేత్రంబను పేరంకించి, సంకీర్తనంబు గా

చిరి. భగండుండును గుమారానుగ్రహంబున గతకల్మషుండై, యిటశివలింగప్రతిష్ఠ గావించి, ప్రవర్తించె. ఎప్పటికి నే నిందు నింద్రాది బృందారకబృందంబులతో నివసించియుందు. ఇందువదనా, సర్వపుణ్యఫలప్రదంబగు నీక్షేత్రంబు మదీయంబింకఁ గావేరీవృత్తాంతంబు వినుమని వెండియును. ౪౫.

## కావేరీవృత్తాంతము.

తే. ధరణిమున్ను కవేరుఁడన్ తపసియొకఁడు, సర్వశాస్త్రార్థకుశలుండు, సర్వభూత
హితరతుండు, మహాత్ముఁడు, శిష్టబుద్ధి, పరఁగుఁ బ్రారబ్ధమున ననపత్యుఁడగుచు. ౪౬.

ఉ. ఆతఁడపత్యకాంక్ష మెయి నాళినిఁ గూడి, యొకానొకష్ఠవి
ఖ్యాతయశంబు సహ్యగిరికగ్గలి వచ్చి, మహాతపంబు గా
ధాతఁ గురించి నిశ్చలమనంబున దుష్కరదీక్షఁ బూని, యు
త్పాతతదివ్యవత్సరసహస్రము లేఁగ నొనర్చె నంతయున్. ౪౭.

వ. ఇట్లేకాగ్రమానసంబున నత్యుగ్రతపంబు గావించునప్పుడు. ౪౮.

మ. ధరగంపించెఁ బయోనిధుల్ గలఁగెఁ బాతాళంబు భేదిల్లె ది
క్కరులున్ స్రగ్గ ననంతుఁడున్ బడియె తిక్కల్ రాలె భూమీధ్రముల్
దిరిగెన్ విష్ణుపదంబు పేలిపగిలె న్వే వేల్పులే వెల్గునుం
దిరమేపంగతి దప్పె రెల్లకడలన్ దీపించెఁ బెంటీఁకటుల్. ౪౯.

శా. లోకాలోకవసుంధరాంబరములన్ లోకాళిగర్గోలుగాఁ
జీఁకాకుంబడ నెట్టకేలకు బుధిశ్రేష్ఠుల్సురశ్రేష్ఠులున్
ఏకీభూతమనస్కులై శరణమంచే తెంచి సత్యంబునన్
లోకేశుంగని మ్రొక్కి యిట్లనిరి సల్కుల్ దొట్రిలన్ దీనులై. ౫౦.

మ. పరమేష్ఠీ, పరమేష్ఠిసృష్టికొకఠింపారం గవేరుండు ని
ర్భరనిష్ఠం దతమాని మానినియుఁదా బ్రహ్మాద్రి బ్రహ్మాద్రి నాఁ
దిరుఁడై భీకరుఁడయ్యె నయ్యయొ! తదుద్రేకాగ్ని నిద్రాణమై
మఱిగెన్ గో మఱిగెన్ జగంబులవిరోయో మందిక్కు నీవేసుమీ. ౫౧.

వ. అని విన్నవించిన నాపన్నశరణ్యుం డన్నలువ నిలువక నిఖిలసురగణపరివృతుండై మహాష్మాయయ గులోపాముద్రన్ వెంటఁ బెట్టుకొని కదలి, కవేరునికడం బొడసూపి. "యిట్లధిక తపంబేల నధికరింతివేని ప్రసన్నుండనైతి; నీకేమి కావలయును నడుగు"మనిన నక్కవేరుం డిట్లనియె. ౫౨.

క. అనపత్యుఁడనగు నాకుం, దనయుని నొక్కని నొసంగి తచ్ఛ్రీగిపం బెయి
ఘనదుఃఖమనుడుపం చనఁ, గొని చతురాననుఁడు వలెఁ గలుగఁ జేయుమి మునిలక్ష. ౫౩.
తే. జగతి ననపత్యుఁడైతివి సంచితమున, దాని విడనాడ జాలునే దైవమైన
ననుభవింపక తీరదే దైనఁ గాని, కాన నీకింకఁ బుత్రులు గలుగఁ బోరు. ౫౪.
వ. అయిన నీకొక్కయుపాయంబు సెప్పెద వినుము. "బ్రాహ్మణోత్తమా, ఇది మన్మానస
పుత్రియగు కన్యారత్నము, లోపాముద్రయనునది, యొసంగెదం దీని ననపత్య దోష
హరణార్థంబు కొమరెఁ గాఁ గ్రహింపు"మని యాపెం జూపి యంగీకారంబు విన్న
వించిన యాగృహమేథి కర్పించి, "సర్వలోక హితరతనై నదీరూపంబునం బ్రవర్తింతు"
ననెడు లోపాముద్ర కవ్వరంబను గ్రహించి, చతుర్ముఖుండు సత్యలోకంబునకుం జనియె
నంతఁ గవేరుండు నయ్యమ్మం గాంచి యిట్లని ప్రార్థించె. ౫౫.
క. జయ సర్వజగజ్జనసం, చయ సంచితఘోరపాపసంహారిణి హే
ప్రియభక్తజనావనని, శ్చయదీక్షే, రక్షమాం లసన్మనిపక్షే. ౫౬.
క. జయజయ లోపాముద్రే, జయ, భద్రే, జయనృశంససంభృతరౌద్రే,
జయజయ భావితయద్రే, జయ ముద్రే, జయ మిళద్విశాలసముద్రే. ౫౭.
వ. అని ప్రస్తుతించినం బ్రసన్నయై లోపాముద్ర యిట్లనియె. ౫౮.
సీ. నేను గూలంకషనై నీరనిధిఁ జేరన ర్మిలి నతి గొదనయ్య తాత
నేను శ్రీకావేరి నా నజపుత్రి నా నాఖ్యలఁ జెలఁగెదనయ్య తండ్రి
నేను బ్రహ్మఘ్నులకైన నఘంబుల నణగంగ సలిపెద నయ్య జనక
నేను స్మరించిన మానవకోటికి నారోగ్యమిచ్చెదనయ్య యయ్య
ఏఁడు ననుఁ జూడఁ బయనమై మూఁడు నాళ్లు, నడుగులణుగు నొజన్మశతార్జితంబు
పాపరాసి నడంచి, యవ్వాని నేను, పుణ్యపథమునఁ బ్రోవంగఁ బుత్తునయ్య. ౫౯.
క. గణ్యక్షేత్రకృతాఘము, పుణ్యక్షేత్రములయందుఁ బొలిసి నశించుక్
బుణ్యక్షేత్రకృతాఘము, పుణ్యాత్ముఁడ నాదు నీటఁ బొలిసి నశించుక్. ౬౦.
వ. అనిన నతండలరి తదనుగ్రహంబున మహామహుండై తదనుమతంబునం బ్రవర్తింపుచు
సుఖంబుండె ననంతరంబ. ౬౧.

## సహ్యాద్రికగస్త్యులువచ్చుట.

చ. ఒకదినమందగస్త్యుఁడనును త్తమమౌని యొకండు సత్కృదం
బకమునుశిష్యకోటియును వారకమూగి కొగం ద్రదయా శిఖల్

ప్రకటము గాఁగ సహ్యగిరిప్రక్కకుఁ జేరె వసిష్ఠగర్గకౌ
శికముఖమౌనికల్పితవిశిష్టసపర్యలనందిపొందుగన్. ౬౨.

సీ. ఆమౌనీశ్వరుఁడొక్క చక్కనిచిగురుటాకు ప్రక్కన్న తింబొల్చులో
పాముద్రంగనికౌతుకంబడర సంప్రార్థించి, భార్యార్థమౌ
వామాగ్ర్యానుమతిన్ గ్రహించికొనెనుద్వాహంబుగాంధర్వమై
ప్రేమంబ్రస్తుతిశక్తినట్టిరుపయై సుర్వీచక్రమందంతటన్. ౬౩.

క. భార్యాశిష్యసమేతుం, డార్యుండఁతఁడగ్గిరీంద్రమందునఁబెక్కం
డ్లార్యాప్రాణేశ్వరునిస, పర్యారతినిలిచెమౌనివారముగొలువన్. ౬౪.

తే. అంతనొకనాఁడుశిష్యులనయ్యగస్త్యుఁ, డరసికనకాప్రవంతికేనరుగఁదలఁచి
నాఁడమత్సహధర్మిణినీడనమీర, లరసిరక్షింత్రుగావుతమనుచుఁబలికి. ౬౫.

వ. ఆ పతివ్రతామణిఁ దనకమండలువునం జొనిపి, యుంతేవాసులకొప్పజెప్పి, తాను కన
కాద్వారంబున కరిగె నంత. ౬౬.

ఉ. తన్నటుడించిపోయెమునితల్లజుఁడొంటినటంచుఁగిన్కమై
నన్నొకొనంగవేరపరమాత్మజపెద్దపెటింగికుండికన్
భిన్నముచేసియొక్కఁడకువేజలరూపిణియైగభీరతా
ఖిన్నమతింగమించెమునిశిష్యులుతత్తరంపడన్. ౬౭.

మ జలరూపంబుననట్లువారునవలాసచ్ఛాత్రులీక్షించిని
హ్వలపారిప్లవగాత్రులైమునిభయుంబవ్వారిగాసెంచుచున్
నిలుమంచేగియువేగమాగిరపుడానిర్నిద్రతేజుండుని
శ్చలచిత్తాబ్జుఁడగస్త్యమౌనికడునిచ్చన్వచ్చినచ్చోటికిన్. ౬౮.

వ. వచ్చినిర్వర్తితనిత్యకృత్యుండిల్వలారిలోపాముద్రకిట్లనియె. ౬౯.

తే. చేడియా, యేలనన్నిడనాఁడిచనెద, వేటి? కేడనుఁబోయెదీ! పాటికినుక
దొలఁగి యెప్పటియట్లన స్మతిఁగియుండు, మనుడుఁగావేరినాథునకనియెనిట్లు. ౭౦.

తే. నాథ, క్షమియింపుమీయపరాధమేఁగ, వేరపుత్రికఁగానఁగావేరియనఁగఁ
బరఁగి, భూతహితార్థమైధరణిఁదీర్థ, రూపమునవిట్లువర్తింతునేపుమీఱి. ౭౧.

మ. ఉల్లమునకోడిగిల్లెడునీల్లఁగార్య, నిశ్చయమ్మునునున్నట్టినెమ్మనమ్ము
నాకునొసెపురుషుండొఁపునధిప, నన్ను, నాఁపకిదిబ్రహ్మనిర్మితమైనయది యు.    ౭౨.

అనుటరయునట్ల కాక యనియుమ్మునియిట్లను నట్లయేని నీ
కనువగుమార్గమేఁ దెలియనాన తియిచ్చెదవైభవంబునం

దనరుభగండునాశ్రమముదారినిగంగలురెండుఁగన్పుఁజే
ర్మినిఁజనుచంద్రపుష్కరిణిమీదుగసంద్రముఁజేరుముగ్మలీ. 23.

వ. నేను భవద్రక్షణార్థం బుభయతీరంబులఁ బ్రతియోజనంబున నొక్కొకశివలింగంబుఁ బ్రతిష్ఠించెద ననుచు నక్కావేరికదలి మొదలాభగండాశ్రమంబు సేరి, తదుక్తమార్గంబున సముద్రంబునకు నిర్గమించె. అగస్త్యుండు నబ్భగండక్షేత్రంబున నొక్క శుభదినంబునఁ దనకమండలువున నొక్కలింగంబు బ్రతిష్ఠించి, తన చెప్పినచొప్పున నామడ కొక శివలింగంబుగా నిలుపుచుఁ గమలాలయంబునకుఁ గృతగమనుండయ్యెనని శంకరుండు వెండియు. 24.

మ. సతిసంక్షేపముగావచించితినదీజన్మంబుతద్వృత్తము
న్వితతంబొప్పనొనర్తువిన్ముతొలుతన్ శ్రీకృష్ణునిన్ రుక్మిణీ
సతికావేరిమహత్వమెట్టియదియో ? సర్వంబువాకి, మ్మనన్
గతశంకుండతఁడిట్లువల్కెజలముగ్గంభీరవాగ్గుంభనన్. 25.

## శ్రీకృష్ణుఁడు రుక్మిణికెఱింగించిన కావేరికథ.

సీ. మునుబాలవెల్లిఁద్రచ్చినఁబుట్టినమృతంబసురులదివంచించిసురలకిడమి
నపుడుమదంశమహామోహయునుయుష్మదంశలోపాముద్రయనునదియును
జనియించిదేవారులనుమహామోహార్ణవనిమగ్నచిత్తులుగనొనరించి
వరసుధాకలశంబుహరియించిదేవాధినాథునకొసఁగిరినలువుమీరఁ
అంతనమ్మహామోహసహ్యాద్రికరిగి, వాళిసింహాచలకగ్రామమందుదేవ
దేవుదాపలవాయవ్యదిక్కునందు, నిప్పటికినిల్చియుండెనోయిందువదన. 26.

చ. కనుఁగొనసర్వలోకహితకాంక్షిణియప్పరశక్తితాజగ
జ్జననియనంగదేవునిప్రసాదమునన్నొలుగొందె, దానిస
న్నిజశరాంతరంబువలనన్నొలికెవ్వఁడువచ్చువానికిన్
జననముమృత్యువున్ దొలఁగుసత్యముసత్యమునమ్ముపైదలీ. 27.

వ. అపుడు నేనా సర్వసౌభాగ్యభాగ్య లక్షణలక్షితయగు లోపాముద్రలోకేశున కొసఁగితి నతండు నమ్మానసపుత్రిక సహ్యాగిరి నపత్యావాప్తి కత్యుగ్రతపంబు సేయుచున్న కవేరునకొసంగె. అత్తపస్వియు నద్దత్తపుత్రికా ప్రసాదంబున నధికకీర్తియుతుండై పరబ్రహ్మసాయుజ్యంబునొందె. ఆలోపాముద్రయుఁ నాలోనన్నారాధించుచు నాబ్రహ్మగిరి నధివసించె. అపుడగస్త్యుండను మునిపురదీక్షికం దీర్ఘమాడి, కుండికజలంబున

నిండించుకొని, సకలతీర్థయాత్రాచరణశీలుండై వియద్గమనంబున దక్షిణాశాపథంబు
పట్టి కదలిపోవుచు సహ్యాచలంబున నవతరించి, పరిభ్రమించుచు నొక్కచోఁ గావే
రింగని కామించి, తదనుమతంబున దేవేరిఁ గాఁగొని, తత్కృతోపచారంబుల కలరి, వరం
బడుగుమనిన లోపాముద్ర లోకోపకారిణిత్వం బభిలషించె. మైత్రావరుణియు
నెఱింగి వంచితుండై యట్లయగుం గాత మోతన్వీ, యీ క్షేత్రంబునఁ బవిత్రంబగు మణి
కర్ణికతో నుండుమని కుండికం బెట్టె నాసతియుం గుపితయై తన్నుపేక్షించినయెడలఁ
గడలిముత్తైదవనుఁ గోపంబడి కుంభసంభవుఁడచ్చోట నయ్యంభోరుహపత్రనేత్రతోఁ
గృతముఖుండై సుఖంబుండి యొక్కనాఁడు కుండిక శిష్యులకరంబులం బెట్టి కనకా
ద్వారంబున కరిగె. అదియెఱింగి యయ్యంగన గంగాజలంబులతో నుప్పొంగి తూరు
పు మొగంబువట్టి నట్టియెడ ముని యెగుదెంచి రాఁగా, యీయాగడం బేల! ఆఁగుమాఁగు
మనిన నమ్మహాభాగ యిట్లనియె. ౭౮.

ఉ. మునివర, ప్రాక్తనంబగుచుఁ బొల్చునిబంధన మేదియిట్లయో
ననువిడనాడిపోయితది న్యాయము గాదని తోఁచకుండ నే
మనమునఁ జింత సేయుమిటు మానుమటంట యధర్మమిత్తఱిన్
వననిధిఁ జేరు దాసనిఁక వమ్ముగుమాటలు వేయు నేఁటికిన్. ౭౯.

క. అనుచు భాషించునంతలోన చటివిప్రు
లదివినిక వేరసుతపత్నిమాత్రయించి
సమయమునుదాఁటియితఁడొంటిజనియెఁ గాన
సమయమునదాఁటియిదియొంటఁ జనక యున్నె. ౩౦.

క. అనితగవయ్యె పలుకుచుఁ, బనివినునమ్మత్స్యదేశవాసుల నెల్లన్
మునివృత్తిహీనులైపొం, డనిమీసతులసతులగుదురని శపియించెన్. ౩౧.

చ. ఇటులశపించి యమ్మునికులేశ్వరుఁడో హృదయేశ్వరీ, భవ
త్పటుతరగాత్రమిద్యోడవిభక్తము సేయఁగనొనటంచుఁ దాఁ
దటుకునఁ బక్ష్మమంబుగను దారిప్రచేతసుతో వచించియుం
తటమలయాద్రికేఁగెవిబుధప్రకరంబులువిస్మయించుటన్. ౩౨.

అపుడు లోపాముద్ర కృపనష్టవిప్రులకైశ్వర్యచిరజీవితాదులొసఁగి,
యద్ద్వంద్వగర్వాపహారి శాసనమునఁ దానిరు దెఱఁగులఁ దనరమాటి
యొకభాగము విదర్భుడైయొప్పి లోపాముద్రయనన గస్త్యమునీంద్రునాశ్రయించె
మిగిలినభాగంబు తగునదియైయొప్పి కావేరియనఁ బూర్వకడలిఁ గలసె.

గడగికావేరిమణికర్ణికయునుఁగలిగి, కుండికాతీర్థమాద్య మైకొమరుమిగిలె
నటకుదేవమునీశ్వరులంటినడువఁ, బ్రత్యహామువచ్చిజలమాడుఁబద్మభవుఁడు. ౮౩.

తే. ఆశ్రమక్షేత్రతీర్థములాపగలును, సురలుభూతపిశాచము ల్నరులతాఁ
లాల్పతృణగుల్మరూపములానియుండుఁ, గనకకావేరియునుఁగూడిశొనినచోఁట. ౮౪.

ఉ. ఓసతి, వింటివే? కనకయుంబొలుపారుకవేరజాతయుః
భాసిలుచున్నచో సలిసి స్నానములిక్కాలికాలమందనా
యాసము గాద్విజఘ్నులగునట్టినరాధములు న్మహాఘుయుం
బాసి సురాలయంబుసను బొయకయుందురు పుణ్యమూర్తులై. ౮౫.

వ. అక్కనకాసంగమంబునఁ బుణ్యాదంబు లనేకశతసహస్రతీర్థంబు లుత్పన్నంబులయ్యె. అందు శంఖతీర్థ, చక్రతీర్థ, నాగతీర్థ, బ్రహ్మతీర్థ, విష్ణుతీర్థ, మహేశ్వరతీర్థ, స్కందతీర్థ, చంద్రతీర్థ, దుర్గాతీర్థ, నృసింహతీర్థ, బభ్రుతీర్థ, యజ్ఞతీర్థ, వామనతీర్థ, వరాహతీర్థ, గారుడతీర్థ, వినాయకతీర్థ, శార్ఙ్గతీర్థ, పాశవిమోచనతీర్థ, కపాలమోచనతీర్థ, మత్స్యతీర్థ, అనంతతీర్థ, పావనతీర్థంబులు, ప్రధానంబులు. ౮౬.

క. కలికల్మషనాశని యై, వెలసినకావేరిఁజూడ వెగడందెదు నే
తులువ యతఁడెల్లకాలము, నిలనీచక్షేత్రజనుల నెత్తి తపించుః. ౮౭.

వ. తత్కనకప్రేతవనంబులనొప్పు సహ్యాపర్వతంబునఁ గుండికాతీర్థం బాద్యంబై హృద్యంబగు. అవ్వల ననుక్రమముగా నొక్కొక యోజనంబునకుఁ గనకాసంగమంబును, బలంపురియుఁ, గపిలాసంగమంబును, చంద్రపుష్కరిణియు, గుంభఘోణంబును, జంబుకేశ్వరంబును, మధ్యార్జునంబును, అంభోధిసంగమంబును, దివ్యతీర్థంబులై భుక్తిముక్తిప్రదంబులై కావేరీనదిం గలిసియుండె నని వాసుదేవుండానతిచ్చిన రుక్మిణీదేవి పరమానందంబునం బొందెననిన విని సర్వమంగళసర్వజ్ఞునకిట్లనియె. ౮౮.

చ. అలరఁగవేరజావర కథామృతసార మొకింత కర్ణశ
ష్కులులపుటంబులందుఁగొని జుర్రియు నామదిబాటసారి, తాఁ
దలఁగక తృప్తిలేమి నిను దాతను వేడ్కొని రమ్మటంచు నె
చ్చెలియగు వాక్కునంగదిసి చెప్పుచు నువ్విళులూరు చుండెడుః. ౮౯.

మ. మది నాయాసము నాకనుగ్రహమున న్మాబోఁటిదీనాళులం
బొదలింపందగునన్న శంకరుఁడు సమ్మోదంబునం జూచి యిం
పొదవం బల్కెఁదలోదరీ, వినుము నీయుత్సాహముంవర్ప నీ
నదిమాహాత్మ్యముఁగూర్చినొక్కకత విన్నాణంబుగం జెప్పెదః. ౯౦.

క. త్వన్నీరంబుల దగయె, మన్నీరంబులను దగయు మరి నాఁకలియున్
ఖిన్నతయుఁ దొలఁగి పోయెడు, నెన్నంగాఁదగునె నీకు నేఁ బుటఁ దనుచున్.

చ. తలఁచిన నే నఘంబులను దగ్ధము చేసెద రేవ చూఁచినన్
సలిలము లంటినన్ యమున జాహ్నవి, నీవు త్రిరాత్రము ల్కడుం
గొలిచినఁ గాని భక్తు దయకుం దగువాఁడన విట్టినీవు మా
కెలన నటింపఁగాఁ దగుదె? కేవలగర్వము లింక నేటికిన్. ౧౦౦.

వ. అని మర్మభేదంబుగాఁ బలికిన నలుక యడంచుకొని జాహ్నవి యిట్లనియె. ౧౦౧.

క. మనతారతమ్యనిర్ణయ, మొనరింపఁగఁ దత్త్వవేత్త యొకఁ డిట లేమిన్
జనవలయు నజునికడ కట, నిను నేనో? నన్ను నీవొ? నెగడఁగఁ గలుగున్. ౧౦౨

వ. ఆసమయంబునందు. ౧౦౩.

మ. నదులీ రెంటికిఁ బెద్దవాదు పడియె న్నాకింపుసంపాదనం
బొదవెన్ దైవము తోడునీడయగు నోహో! యిప్పు డంచెంతయున్
మది సంతోషము నొంది పొంగుచు విన స్వానైప్రకాశంబుగా
నిది యానా నని శాంబరీద్విజవరుం డేగెం విధిస్థానమున్. ౧౦౪.

వ. నారదుండు సత్యలోకంబున కరిగిన వెనుక గంగ, కావేరిదిక్కు మొగంబై యిట్లనియె.

సీ. కావేరి, విను నేనుఁ గమలనాభునిపదాబ్జమునందు బిడ్డనై పరగితి నమ
కావేరి, విను నేనుఁ గమలాసనుని కమండలువునఁ దల్లినై చెలఁగితి నవ
కావేరి, విను నేను దేవేరినై జగదీశుని మకుటాగ్ర మెక్కితినవ
కావేరి, విను నేనుఁ గ్రతుభుగాళికి సుఖప్రదనై నభంబున వరలితినక
యలభగీరథుఁ డర్థింప నతనివెంట, ధరణికరుదెంచి మునిశాపదగ్ధులైన
సాగరుల కెల్లఁ బుణ్యంబు సంతరించి, భువనముఁ బవిత్రముగఁ జేసి పొసఁగుదు నమ.

ఉ. ముప్పదిమూఁడుకోట్లు సురముఖ్యులకు న్నివుఁ డట్టులోకమం
దొప్పెడు నెల్లవాకలకు నుత్తమ నే నని నమ్ము నాయెడన్
అప్పరమేష్ఠినిర్మితములై మహిమందగి పుణ్యదంబులై
ముప్పదిమూఁడుకోట్లలగు ముఖ్యతరంబులు తీర్థరాజముల్. ౧౦౫

సీ. సకియరో, తీర్థరాజమ్ము ప్రయోగమ్ము నెమ్మిమైనాయంద నిలిచియుండుఁ
దరుణిరో, వరహరిద్వారమన్ దీర్థంబు నెమ్మిమైనాయంద నిలిచియుండుఁ
గలికిరో, మణికర్ణికావరతీర్థంబు నెమ్మిమై నాయంద నిలిచియుండు
వనితరో, పుణ్యవర్ధనమను తీర్థంబు నెమ్మిమై నాయంద నిలిచియుండు

## గంగా కావేరులు సత్యలోకమునకుఁ జనుట.

అనుచు నొంపుగఁ గడవంగ నాఁడుకొనుచు, నారదుఁడు మున్ను పోయినదారిపట్టి
చ. గంగ, కావేరియును, గోపకలితస్వ్రజయ, లగుచు సత్యలోకమునకు నరిగి రపుడు.

అరిగి సభాసదులగు దేవర్షిగణంబులు సావధానులై వినుచుండఁ దమవాదు దెలిపి తా
రతమ్యంబు నిరూపింపుఁ డని ప్రార్థించుటయును. ౧౧౭.

మ. అలలోకేశసభాంగణంబునను బ్రఖ్యాతిం బ్రవర్తించు మూ
నులు జేజేలు మహామహు ల్మది దగ న్న్యాసాధికం బెస్సఁ దే
కలఁ గంగన్నులు మోడ్చి లోఁ గనుచు మే సట్టిట్టునం ద్రిప్ప కా
దలల న్వంచియు సాలభంజికలనం దల్కార్తి రప్పట్టునన్. ౧౧౮.

వ. ఇట్లుండి కొంతవడికి గంగ నుద్దేశించి తమలోఁ దా రిట్లని ప్రసంగించిరి. ౧౧౯.

మ. పరగం దొల్త హిరణ్యగర్భుని శుభవ్యాపారపాత్రంబున
న్వరనీరంబయి పిమ్మట న్హరికి సత్పాదోదకంబై యనం
తర మీశానుని శీర్షభూషణమునై తర్వాత శ్రీజహ్నుస
ద్వరకన్యామణియై ప్రవర్తిలెదు నీభాగీరథీగంగయే. ౧౨౦.

సీ. ఇది గదా! మున్ బరమేష్ఠికమండలూదర మున్కపట్టు గాఁ బరగుగంగ
యిది గదా! మున్బరమేష్ఠిచే వామనుపదముల నిడఁబడు పరమగంగ
యిది గదా! మున్ జగదీశుదేవేరియై శిర మాటపట్టు గాఁ జెలఁగు గంగ
యిది గదా! మున్ జగతీశుని వెనువెంట ధరణికి వేంచేసి తనరు గంగ
యిది గదా! సర్వపుణ్యము లిచ్చుగంగ, యిదిగదా! సర్వలోకము లేలుగంగ
యిదిగదా! సర్వమును భరియించుగంగ, యిదిగదా! సర్వమయమునై యెసఁగుగంగ.

వ. అంతఁ గావేరి నుద్దేశించి. ౧౨౧.

మ. తనరం దొల్తట శౌరిఁ జేరినదియై తర్వాత శ్రీభారతీ
శునకు న్మానసపుత్త్రియై పిదప సంశుద్ధుండు రుద్రాంశచే
జనితుండైనయగస్త్యమౌని కెలమిన్ సంధించు దేవేరియై
కన నామీఁదఁ గవేరపుత్త్రికయు నై కన్పట్టు నీగంగయే. ౧౨౨.

సీ. ఇది చూఁడీ! లక్ష్మ్యంశ నెసఁగి కృష్ణానుసంధానంబునను బొంది తనరుగంగ
యిది చూఁడీ! మునుఁ బరమేష్ఠిమానసపుత్త్రియై ప్రవర్తిల్లెడు నమలగంగ
యిది చూఁడీ! రుద్రాంశ నెసఁగునగస్త్యున కుత్తమజాయయై యొప్పుగంగ

నతఁడు సవితృగోళమందుండు నెవఁడిందు సావిత్రి జపియించి సంధ్య వార్చు
నతఁడు పితృప్రీతి నమరత్వమునఁ బొందు నిందుఁ బిండము లెవ్వఁ డిడునో పితరు
నిందు వారాణసీక్షేత్రమందు మరణ
మంద నెంతు రింద్రుండొట్టి యమరు లెల్ల
మూఁడుకన్నులు నైదుమోములును బొంది
చిలువపేరులు నెలసగ ల్బెలఁగ గిత్త
తత్తడుల నెక్కి నడయాఁడఁ దలఁతు రెపుడు. ౧౩౨.

వ. కావున నీగంగానది కేనదియును సరిరా దనిపలికి కావేరి నుద్దేశించి గంగదిక్కు మొగంబై యిట్లని ప్రశంసించె. ౧౩౩.

బ్రహ్మ గంగతోఁ గావేరిమహిమ చెప్పుట.

శా. దేవీ, నీయెడఁ బోల్చు క్షేత్రములునుం దీర్థంబులుం సర్వ మి
క్కావేరీనదియందుఁ బోల్చు నిది ముఖ్యంబై జగజ్జాలముం
బ్రావీణ్యంబున సృష్టిచేసి పొదలింపం ద్రుంపఁగాఁ గర్త్రియై
తా వెల్గొందెడు నాదిలక్ష్మియ సుమీ! తర్కించి యూహించినం. ౧౩౪.

చ. ఇలఁ గల యెల్ల వాఁకలకు నీవధికత్వము నొంది కీర్తిని
న్నెలఁగెద విక్కవేరసుత నీకును నాకును నెల్లవారికిం
దలఁపఁగ మేటి యంచు మునుఁ దామరసేక్షణుఁ డానతిచ్చె న
ప్పలుకులు విశ్వసింపఁదగుఁ బంకజలోచన, యెల్లవారలుం. ౧౩౫.

వ. మఱియు నొక్కవిశేషంబు గల దేనొక్కనాఁడు, ఆదిలక్ష్మి ననేకవిధంబులఁ బ్రార్థించినం బ్రసన్నయై జగన్మోహనాకారంబునం బొడసూపి, వరంబడుగుమనిన నెప్పుడు నీ వీరూపంబున మానసపుత్రికవై నాకడ మెలంగుమని వేఁడి, యొడంబఱిచి, సృష్టిస్థితిలయకారిణియు, సచ్చిదానందస్వరూపిణియు నగు నాపెకు లోపాముద్రయను సార్థకనామంబు పెట్టి, నాయింటం బెట్టుకొంటి నంతఁ గొంతకాలంబునకుఁ గవేరుండు దేవేరితో నన్నుఁ గుఱిచి పుత్రార్థియై తపంబు సేయుచుండ నే నీలోపాముద్రాసహితుండనై తదంతికంబున కరిఁగి, నీ కౌరసంబగుస్త్రీపురుషసంతతి లేదు. అయిన నొక్కవిధంబున స్త్రీసంతతి గలుగఁజేయుదు నని మఱియును. ౧౩౬.

చ. ధరణి నపత్యమందునఁ బ్రదానము కన్యక యే! తలంప న
త్తరుణి కులత్రయంబును బిధాయకియై తగ నుద్ధరించి, యే

జాతన్ రాజవరాత్మజాత, విని, తజ్జన్మర్క్షలగ్నాదులం
జేతస్స్ఫూర్తిఁ బరీక్షచేసి, నృపతిశ్రేష్ఠంబుతో నింపుగన్. ౧౪౬.

చ. వెఱవక మీసుతన్ గుఱిచి విన్నది చెప్పఁగ నిష్ఠురంబు రా
దెఱిఁగిన యర్థముం దెలుప కే మిటు లూరక యుంట పాఁడిగా
దెఱుకగలారిపై నెపుడు నేలిక లల్గర, యల్గరేని యు
త్తఱిన యనుగ్రహింతురు గదా! ధరణిన్ ధరణీంద్రచంద్రమా, ౧౪౭.

వ. అని తదనుజ్ఞ వడసి కార్తాంతికులు వెండియును. ౧౪౮.

క. పరమంత్రశక్తిఁ బరగెడు, నరవర, నీతనయ దుష్టనక్షత్రమునన్
ధరపై జన్మించెను గ్రహ, పరిశాంతి యొనర్చినను శుభము పొసఁగదిలన్. ౧౪౯.

ఉ. తల్లియుఁ, దండ్రి, యన్నలును, దమ్ములు, నక్కలు, నత్తమామలుం
జెల్లెడు నెల్లచుట్టములుఁ, జేలును, జెట్టులుఁ, బాఁడిపంటలుం
దెల్లముగా నశించు జగతీవర, నీదుకుమారి జవ్వనం
బెల్ల నడంగు దాఁక భవదీయగృహంబున నుండెనేనియున్. ౧౫౦.

తే. కాన దీనిని విడువుమీ? కానలోన, నూతిపాలికి నీకును నుర్వికల్లఁ
గుశలమును గోరితేని నీకూర్మి విడిచి, యురగదష్టుఁడు తనవ్రేలు నఱుకునట్లు. ౧౫౧.

వ. అనిన విని వనరుచున్న యినునకుం దగ్గరి ప్రస్తుత లిట్లనిరి. ౧౫౨.

మ. నడుమధ్యం దులసీమహావనమున న్గంజాయిచెట్టట్లు చే
ర్పడ నింపొందగఱాలపాఁతఱ గణింపం గాజుతా యట్లు మే
ల్మడుగుంజీరకు నల్లమచ్చగతి నిర్మాలిన్య పానీదుపం
గడమందుం జనియించెఁగూతు రరయం గా సర్వముం బాడుగన్. ౧౫౩.

తే. కన్నకడుపన్నమోహంబు కడకుఁద్రోచి, సకలజనులను రక్షింప సమ్మతంబ
యేని విషవల్లితో సెన యైననీదు, కన్య నడవులపాల్సేయఁగడఁగు మిపుడు. ౧౫౪

చ. అవనిఁగడిందిదుష్టుఁడగు నాతని నొక్కనిఁదున్మి సర్వసా
ధువులకు సౌఖ్యసంపదలు తోడ్పడురీతినిఁ జేత పున్నియం
బవునో? సమస్తసాధువుల కాపద లిచ్చెడువానిఁ బ్రోచుటల్
చివరకుఁ బున్నియంబగునో? చిత్తమునం దలపోసి చూఁడుమా. ౧౫౫

తే. కులము రక్షింప నొక్కని విడువ వలయు
కులము విడువంగదఁ దగుగ్రామ మలరుకొఱకు

న్నిలుపం గారణ మేమియో! కడుదయ నీక్షించి విశ్వేశ్వరుం
డలరించె న్నన కాత్మజాతఁ జనుఁబా లర్పించి పోషింపవే. ౧౬౪.

వ. అనుచు వ్యాఘ్రియు నట్లయగుం గాతమని తనచన్నుఁగుడిపి పోషింపుచుండె. అంత నబ్బాలికాజనచూళికారత్నంబు శుక్లపక్షక్షపాకరుని చందంబున దినదినప్రవర్ధమానయై. ౧౬౫.

సీ. చిడిముడినడకల చిన్నెలన్నియు నేర్చెఁ బ్రోదిరాయంచల పొందువలన
జిలిబిలిపలుకుల తళుకులన్నియు నేర్చెఁ బెనుచురాచిలుకల సిందువలన
నడరెడుపాటల హనువు లన్నియు నేర్చెఁ బొదల నల్లాఁడు తుమ్మెదలవలనఁ
జిటిచిటినటనల సిరు లన్నియును నేర్చెఁదడికాఱునెమ్మిల దళమువలన
నిట్టు లారాజకన్యక పుట్టి నేర్చె, నోక్కొ! పుట్టక నేర్చె నోక్కొ! యనంగ
నడవి మానుషధర్మము లన్ని నేర్చెఁ, బులులపెంపుడయ్యును బూర్వపుణ్యమునను.

చ. పులిచనుఁబాలుద్రావుటను బొల్తుకయుం బులిరీతి మెల్గుచుఁ
బలము జవంబునుం గలిగి పర్వతముల్ నదులుఁ జరీలునం
జులకన దాఁటి సింగముల జుంజుఱుఁ జేకొని యీడ్చిపుచ్చు నే
న్గులకరము ల్కరంబులను గొంచొగి గిఱ్ఱునఁద్రిప్పి వైచెడుఁ. ౧౬౭.

క. ఇటు లతిమానుషకర్మల, దిటపడి, క్రొవ్వులఁగూడి, దినదినము మహో
త్కటశౌర్యంబును జూఁపుచుఁ, బటుశక్తిం బరగుచుండె బాలిక యడవిఁ. ౧౬౮

తే. ఘనుఁడు ప్రత్యగ్రుఁ డగునధికారి యలతిఁ, బ్రతనుఁబఱివృఢుఁగెలిచి తద్వాసమైన
పదవి నాక్రమించె నన నాసుదతి దేహ, మునను బాల్యంబు జాఱి యౌవనము మీఱె.

క. నవయౌవనంబు చేతను, సువిభక్తం బగుచు గాత్రిసుందర దేహం
బు విభాకరకరవికసిత, మవు వనరుహ మట్లుతనరె నతికోమలమై. ౧౭౦.

సీ. పాలితచమరీ సువాలంబు వాలంబు రాజితశ్రీనిజ ప్రతులు శ్రుతులు
సదమలశశిబింబ సదనంబు వదనంబు చారుసుధారసస్రావి మోవి
వరశరచ్చంద్రికావాసంబు హాసంబు గాంగేయసూన వికాస నాస
సన్నుతశతపత్ర జైత్రము నేత్రము ల్వెదికుచందురునితో నెదురు నుదురు
జలరుహ మనోహరాకరములు కరములు, స్వర్ణసరిదగ్రవీచికావళులు వళులు
పూతమందార మకరందముక్కు వాక్కు, పరమశంపాలతాభానువర్తి మూర్తి. ౧౭౧.

ఉ. కంబగు కంధరంబు, కనకంబగుఁజెన్నలరారు మేను, నా
కంబగు దేహమధ్య, మలికంబగు పెన్నెరు, లొప్పుచున్నదో

కంబగుఁ గుల్కుచన్నవ, శుకంబగుఁదియ్యనిపల్కు, చంద్రపా
కంబగు నెమ్మొగంబు, ఫలకంబగు పెన్నుదు రవ్వధూటికిన్. ౧౭౨.

ఉ. గిల్లినఁబాలుగారు నవఁగీల్గలమై యుపరంజిచాయలన్
మొల్లము గ్రుమ్మరించు మొయిఁబోలిచి పెట్టినసొమ్ము జవ్వనం
బల్లన నావరింప సఖు దౌహిత్రశేఖరి ముజ్జగంబులం
బల్లవపాణుల న్గెలువ వచ్చును నాఁడిగ సుందరంబునన్. ౧౭౩.

వ. ఇట్లు ముద్దియగు జవ్వనంబున నివ్వటిలు నవ్వనితారత్నంబు మదనదేవతా మోహన మంత్రశక్తియునుంబోలెఁ బురంబులఁ జెలఁగుచుండె. అయ్యవసరంబున సింహళదేశాధినేత పుష్పకేతుండనువాఁడు చతురంగబలోపేతుండై, మృగయార్థ మడవికరుదెంచి, ధక్కాహుడుక్కాది వాదిత్రంబుల వనంబుఁదోలించిన నకోలాహలంబున క్షోభించి, యచటి శుక, పిక, బక, బలాక, కేకి, కోక, కాక, ఘూక, కంక, గృధ్ర, కలహంస, కపోత, ప్రముఖనానావిహంగమంబు లెగురుచు బిచ్చుచుం గకావికలై నాకంబునకెగురంజొచ్చె. గజ, గవయ, గండక, భేరుండ, సింహ, శార్దూల, శరభ, సాళ్వ, వరాహ, వాహ, రాసభ, కాసరాదిమృగవారంబులు నాలుఁగుపులు నింగి ముట్టఁ జెట్టాఁకుచుఁ గఁజెల్లఁదమ్ముగ యూడనిం బాఁడఁజొచ్చె. అప్పుడమ్మహాసంకులంబు విని, యిది యేమిరా? యని యదరిపడి, శార్దూలంబు నిజపరివారంబుతో రాజపరివారంబు కడ కేగు దలఁచుటకేయుం గని మూఁకలు చీఁకాకుపడి, భయసంభ్రమంబుల నివ్వెఱఁజెందుల దక్కి నిలిచి చూఁచుచుండె. అప్పుడు రాజు మృగరాజవిరాజమానయగు నారాజముఖిఁ గని, మోహించి, యిది యెవతె? యని కొంతదనుకఁ దర్కించి, వెనుకఁ జనసమునస్సంక్రమణంబునంబట్టి రాజకన్యకఁగా రాద్ధాంతీకరించి, తన సేనం బురికొల్పి, యీయల్పమృగంబులం జంపి యాచంపకగంధిం గొనిరం డనుడు మృగయులు మృగంబులఁగవియ నవియుఁగబళింపనున్న నివారించి, పరేంగితజ్ఞాననిపుణుండును, సర్వభాషాకుశలుండు నగు మృగరాజు నిజహస్తం బెత్తి మనుష్యవాక్యంబుల మనుష్యేశ్వరున కిట్లనియె. ౧౭౪.

## మృగరాజు రాజునకు రాజనీతి చెప్పుట.

గీ. బుద్ధిబలమున నెల్లగుఁబొనర వలయు, సందుఁబ్రకోపితుల కవశ్యంబు మఱియు
రాజధర్మంబు గహనంబు రాజచంద్ర, యెఱుఁగఁజెప్పెద విను మది హితము గదుర.

సీ. ఇంద్రియబంధనంబు నిష్టధీసచివవాక్యప్రవర్తనమును, విప్రహితము,
పురదుర్గరక్షణంబును, ప్రజారామపాలనంబును, మహీపాలజయము

కాలోచితవ్యయ, మాలమునందిచ్ఛ, మతరక్షణంబును, మనుజహితము
నశ్వేభయానంబు, నస్త్రశస్త్రకలాపపరిచయంబును, గవిసులమైత్రి
మఱియునవరోధజనరక్ష, మంత్రగుప్తి, కొడుకులకు నేనిస్వాతంత్ర్యమిడకయుంట
నెఱిఁగికొనరాజధర్మంబులివియసుమ్మి, వీనిఁదవిలినరాజభివృద్ధిఁజెందు. ౧౭౬.

వ. ఈచెప్పినధర్మంబులకు వైపరీత్యంబుగఁబ్రవర్తించుచు బ్రాహ్మణావజ్ఞతయు, బలవద్వైరంబును, దుర్మంత్రి సంగతియు, అలభ్యార్థాభిలాషయు, భూతహింసయు, ద్యూతచౌర్యమద్యంబులును, వేశ్యాగమనంబును, వేఁటయు నెవ్వండు సేయు నవ్వాఁడు నిజరాజ్యపదభ్రష్టుం డగు నని వెండియు. ౧౭౭.

గీ. మృగయ శాస్త్రాంతరంబులఁదగును బుణ్య, మనుచుఁజెప్పెడు నది నెమ్మి నరసి చూడ
శిష్టజనరక్షకొఱకును దుష్టశిక్ష, కొఱకుఁగాని జంతుహరంబుకొఱకుఁగాదు. ౧౭౮.

వ. అని మఱియును. ౧౭౯.

ఉ. నాకులమందునం బొడమి, నాకులకే నవిజేయమై దృఢా
నాకులశక్తిమై నలరు, నాకులగోత్రజులన్ మృగేంద్రులన్
నాకులభక్తితో నెపుడు, నాకులసన్మతి నొప్పువాని నా
నా! కులకించి త్రుంపఁదగునా? కులధర్మము లేద? నీకిటన్. ౧౮౦.

చ. నరవర, యిన్ని క్రొవ్వులు నానుడి నాఁదలఁదాల్చి, యేవనాం
తరమున కేగ కిందణఁగి, దాయలజోలికి నేనిఁబోక యే
చొరుగుననో క్షుధం గెడపుచు న్మనివృత్తి వసించుచుండు నె
త్తఱి నపకారమున్ సయిచి తాల్చెదు సైరణ చెల్లియుండియున్. ౧౮౧.

చ. వెలసి మదాజ్ఞ యొప్పమును వీనిని వీనిబలంబు సంద్రమును
జెలియలికట్టవ్రాలె నిలఁజేసెదుఁగానిసుమంత సన్నయిఁ
జెలఁగి త్వదీయసేనల నశింపఁగఁ జేయుట కిన్నియేల! యొ
క్కలఁతియ చాలు శస్త్రములు నస్త్రములుంగణియింప వింతయున్. ౧౮౨.

శా. నామాటన్ వినకుంటివేని ధరణీనాథా, భవత్సేన యీ
భూమిం గాలిడ కేగు నెచ్చటికో! నీభూరాజ్యముం జెల్లెడున్
నీమార్గం బరయంగ నొందుగతి గా నేనెంచితిం గాన నిం
కేమై యుద్ధము మాని నన్ను శరణం బేతెమ్మొగిన్ లగ్గగున్. ౧౮౩.

చ. నరవర, నీకుఁగావలసెనా? యిది నాసుత దాన మిచ్చెదన్
దురమునఁగెల్చి బల్మి మెయిఁ దోకొని పోదు మనంగ రాద యీ

తరుణియు చాలు నీబలముదర్పము నాఁగఁగ దుష్టహార్తమం
దరయ జనించె నంచు ననుగాథపుఁడిచ్చిన నేను బెంచితిన్. ౧౮౪.

వ. అనిన నత్యంత కుతూహలాయత్తచిత్తుండై పుష్యకేతుండు పులికి నమస్కరించి
యిట్లనియె. ౧౮౫.

మ. దూరాలోకనశీల, కేవలము శార్దూలంబునా నిన్ను నే
నేరీతి స్మరియింతు? వాఁడవె హరివా? యింద్రుండవో? బ్రహ్మవో?
కారుణ్యంబున నన్నుఁ బ్రోచుటకునై కన్పట్టు రుద్రుండవా?
యెవరో? తెల్పు మనంగఁ గ్రోలుపులి దా నిట్లందుఁ దల్పెన్ గృపన్. ౧౮౬.

## శార్దూలంబు తనపూర్వవృత్తాంతము చెప్పుట.

మ. హరిగా నింద్రుఁడఁ గాను చంద్రుఁడను గా నస్మత్పురావృత్తమున్
ధరణీంద్రోత్తమ, చెప్పెద న్వినుము గంధర్వుండ నేనొక్కఁడన్
హరపూజాపరతంత్రమానసుఁడ నొక్కప్డెల్ల రేవానదీ
వరతీరంబున నేఁ దపంబొనరుప న్వర్తించితిన్ భక్తినై. ౧౮౭.

తే. నిత్యమును నేను వేకువ నిద్రలేచి, నిత్యకృత్యంబులను దీర్చి, నియమవృత్తి
తోడ రేవానదీస్నానమాఁడి, భక్తి నలఁగ సంధ్యాద్యనుష్ఠానసమితి దీర్చి. ౧౮౮.

తే. అచట నొకచోట బద్ధపద్మాసనుండనై, నయ్యు నిష్ఠాగరిష్ఠుండ నగుచుఁ గడిమి
నింద్రియంబుల నరికట్టి యంతరయేని, దనుకఁ బంచాక్షరి జపింతు ధరణినాథ. ౧౮౯.

వ. ఇట్లహరహంబు నియమవ్రతంబునఁ బ్రవర్తింపుచు నొక్కనాఁడు మలయమారుతాది
రాగంబులు జంత్రగాత్రంబుల మేలగించి సుస్వరంబున శివగీతంబులు వాడుచుంటి
నయ్యవసరంబున. ౧౯౦.

మ. తళుకుంబంగరు డాలు జీలి జడ మట్టవాడు నెమ్మేనునన్
గులుకుంగుబ్బలు వాలుగన్నులును పిన్నంబోలు లేఁగౌను సం
దడుబార్వేంద్రుకి బింబుబింబమును నన్నిందించు నెమ్మోమునుం
గలనారీమణి యొక్కతువచ్చెను బుతుస్నానార్థమై యాడకున్. ౧౯౧.

ఉ. వచ్చి జలంబు లాడి యలబోపన నాకుక లేఁత్రప్రాయపు
స్వచ్ఛట గాన నేనుడువుమూర్ఛనలం దగురాగమాలికన్
మ్రుచ్చిలి తెచ్చి గాలి చెవిఁబోసిన పోలి మనోజశిన్నయై
చెచ్చెరవచ్చి నాకడకుఁజన్నెలు వన్నెలు కొన్ని చూఁపుచున్. ౧౯౨.

ఉ. మత్తిలి నాతి రాగరసమగ్నుఁడనై తగునన్నుఁజూఁచి పే
రెత్తినలజ్జ నిల్వక పయింబడి, బిగ్గరఁగౌఁగలించుచో
నత్తఱి రెండుమూఁడుపసు లాఁగుము కూడదు కూడ దన్న నన్
జిత్తజుబారి నప్పనముఁజేసి రమించె వివస్త్రయై నృపా. ౧౯౩.

వ. అట్టియెడ దానిమగఁ డరుగుదెంచి, భోగులక్రియ నేకీభూతులమై భోగక్రియలం దేలు మమ్మిర్వురం గాంచి, కోపించి, నన్నుశార్దూలంబవు కమ్మని శపించి, యమ్మగువ కిట్లనియె. ౧౯౪.

మ. కులటా, నన్నిటు కన్నొఱంగి యొరుతోఁగూటంబు వాటించి స
త్కులధర్మంబెడలింతు గాన శునివై కోలంబవై పిల్లివై
మలభుక్కీటమవై పిశాచమవునై మాతంగివై వేశ్యవై
కలకాలంబుగ నేఁడుబాములును బోకార్మంచుఁదిట్టెన్ గృథన్. ౧౯౫.

వ. నే నపుడతనియడుగులంబడి నిర్దోషుండ నరసి రక్షింపు మనిప్రార్థించిన ననుగ్రహించి నీవు వ్యాఘ్రింబ వయ్యునుం గన్యాదానప్రభావంబునం జేసి, పురుషవ్యాఘ్రింబవై ప్రకాశింపఁగలవని శాపమోక్షంబు పలికి యెటయేనియుం బోయె. దానంజేసి నా కిట్టిరూపంబు ప్రాప్తం బయ్యెఁగాని శివపూజాప్రభావంబున జాతిస్మృతి మాత్రంబు చెడ దయ్యె. ఇది నాశాపమోక్షకాలంబు. ఇపుడ నీకికన్నియ నొసంగెద నని విధిదృష్టవిధానంబునఁ గన్యాదానంబు చేసి గరితలకుం గఱపఁదగు బుద్ధులు వేనవే లెన్నియేఁగల వవి యన్నియునుం గూతునకుం గఱపి, జామాతతో నంపిపుచ్చుటయు నతండును సపరివారుండై పురంబరిగి సుఖంబుండె ననంతరంబ. ౧౯౬.

చ. పులియును దేహముం దొఱఁగి, పొల్పగుప్రాక్తనదేహమంది, ని
శ్చలముగ స్వర్గ మేగి యట సౌఖ్యములం దులదూఁగుచుండియున్
సలిపినకన్నె నీగికతన నృగుండను చక్రవర్తియై
యిల జనియించి తొంటిస్మృతి నేదక భూతల మెల్ల నేలుచున్. ౧౯౭.

క. అతఁ డపుడఱువది వేగుర, సుతలఁబ్రసాదింపు మనుచు శుద్ధాత్ముండై
శితికంఠుఁగుఱిచి యొక్కపు, డతులితముఁగఁదపము సేసె నాసమయమునన్. ౧౯౮.

వ. ఇంద్రాదిదేవత లెల్లరు దానార్హలగు కన్య లఱువది వేవు రీతనికి లభియించిన మనకు మనికిపట్టుల నుండంబట్టదని గణపతి నాహ్వానంబు గావించి వానితో నిట్లనిరి. ౧౯౯.

శా. సప్తద్వీప సముద్రముద్రిత ధరాచక్రంబు సర్వంబు సం
ప్రాప్తంబయ్యెఁదలంప నీతనికిఁ గన్యాదాన మర్పించుటన్

దృష్టుండై శివుఁ డిన్ని వేలసుతులం బ్రశస్తవరదుం జేర్పు మ
దృష్టం బీసురలోక మాతనిని చేతోవీథి నూహింపుమా. ౨౦౦.

వ. దేవా, నీ వెట్టిదే నతని నడిగినాం డప్రతిష్ఠుండవు పుత్త్రకలకు మాఱు పుత్త్రుల నడుగుమనిన
నతం డట్లకాక యని తపమునుమునకంబునం బ్రవర్తిల్లె. అంత నీశ్వరుండు సగరునకుం
బొడసూపి వరంబు వేఁడు మనిన నాఁటికి వేల పుత్త్రుల నిడుమనుడు నట్ల యిచ్చితి
నని శివుం డంతర్ధానంబు నొందె. తత్ప్రసాదంబున సగరుండు షష్టిసహస్రసం
ఖ్యాకంబగు పుత్త్రులం బడసి సుఖియై యుండెను. ౨౦౧.

చ. మనమున నాఁటుకొల్పితె! సుమారవమూర్త్వ మదంతయొప్పని
వ్వనరుహగంధి నాసుతి కృపామతి నీసుతి గా సుసంగడం
గొనుమన నక్రమేయ సుమనః గోరిక నీరిక తెల్పి నాదిల
క్ష్మిని గ్రహింయించినాఁడవు సుమా! యిదె జహ్నుసుతావతంసమా. ౨౦౨.

## బ్రహ్మాదులు కావేరికి వరంబు లిచ్చుట.

వ. మందాకినీ, అప్పుడు లోపాముద్ర యన్నమానవిం జేసితిమని పగవ నేనును తల్లీ, మా
మూర్తిత్రయంబు చెప్పిన సన్నిధి యుంచి యుండు. నీవు లక్ష్మీలోపాముద్రాఖ్యల
రెండు స్త్రీరూపంబులును, కావేరీ సలిలాఖ్యల రెండు నదీరూపంబులును, బొందఁగలవు.
అందుఁ గావేరీ నదియందు సాగరసంగమంబుదనుక నుభయతీరంబుల నగస్త్యుండు శివ
లింగంబులఁ బ్రతిష్ఠించు. నీ తీరంబుల నున్న సుపవిత్రు లనఘులకును మోక్షంబు సిద్ధించు.
నీకడం గోటానకోటులు తీర్థంబులు క్షేత్రంబులు నొప్పుచుండు. అందు బ్రహ్మాగి
రియుఁ, బినాకివాసంబును, బ్రహ్మకుండంబును, భగండాశ్రమంబును, సప్తర్షితీర్థం
బును, గనకాసంగమంబును, హావ్ని పుష్కరిణియు, సూర్యపుష్కరిణియు, లక్షణా
సంగమంబును, హేమవతీసంగమంబును, శంఖతీర్థంబును, వశిష్ఠాశ్రమంబును, బశ్చిమ
వాహినియుఁ, గపిలాసంగమంబును, జంద్రపుష్కరిణియు, సింధుసంగమంబు, నను
నీవదు నైదును బ్రధానంబులు. ౨౦౩.

తే. మరణమునఁ గాశి ముక్తిక మాత్ర మగును, జెలఁగి నీ క్షేత్రముల సేవచేసి నేని
వాని కగు ముక్తియును భుక్తి గాన నీదు, క్షేత్రములు పెద్ద కాశికా క్షేత్రమునకు.

తే. తల్లి, కావేరి, నీజల ముల్లసిల్లఁ, దాఁక వచ్చిననాయువు దాఁకెనేని
సకలజనులకు మోక్షంబు సంభవించు, నవ్విషయవాసు లెంతపుణ్యాత్ములొక్కొ?

వ. అపుడు విష్ణుండు కావేరి కిట్లనియె. దేవీ, నీవు నా దేవేరివగు నాదిలక్ష్మివి నేను నీ
యాశ్లేషసుఖం బభిలషించి శ్రీరంగంబున శేషశాయినై యుండెద. నీవును గుంభ

సంభవుననుమతంబునఁ గావేరియను నదిపై నీలశైలంబున మద్రూపుండగు కపిలునిచేఁ బ్రార్థింపంబడి కపిలయను పేరునుం బొందఁగలవు. అని దేవతలం జూఁచి యిట్లనియె,

చ. నదులకునెల్ల మేటి యయినల్వగు గంగయు నీకవేరజా
నదికిఁ గొఱంత యౌ ననుచు నానుడి యిక్కడ వేర కూల్పఁగా
నదనగునా ? సమస్తమును నారయ మీక యెడందఁదోఁచు ని
య్యది కడుభుక్తిముక్తులు సమర్పణ చేసెడు సేవకాళికిన్. ౨౦౮.

తే. ఎఱుఁగ కంటిన వహ్ని యెట్లేటియఁజేయు, నట్లు కావేరి యును జను లార్తులందు
నెఱుఁగ కాడినఁబాపౌఘ మెటియఁజేయు, నిది యథార్థ మటంచు మీ రెఱిఁగి కొనుడి.

చ. తరణి తులాగతుండయి ముదంపడు నన్నెలరోజులు, న్మునుల్,
సురలును, సర్వతీర్థములు, శూలియు, బ్రహ్మయు, నేను, వృశ్చికం
బరయఁగ వచ్చుదాఁక ముదితాత్ముల మయ్యుఁగవేరజానదీ
వరతటమందు నిల్తుము ధృవంబుగ నప్డు, ఫలంబు పెంపగున్. ౨౦౯.

తే. భూమిఁ గావేర్యరణి సంప్రభూత పుణ్య, సారవహ్ని తులామాస మారుతంబు
వలనఁ బ్రేరేఁచి నిట్టపర్వతము వంటి, పాపతూలంబు దహియించు నేఁపుమీఱి. ౨౧౦.

తే. భానుఁడల్ల తులాగతుం డైనయపుడు, గంగ, తనతల్లి, కావేరి, రంగశాయి
తండ్రి, యని భక్తిఁదలఁచు చుఁదరలివచ్చి, నెలయు నన్నది నివసించి తొలఁగి పోవు.

సీ. శ్రీదేవి పరమేష్ఠి కాదిఁ బ్రత్యక్షమై మెలఁగు రేవత్యష్టమీ దినమున
నదిరూపమును బొంది నల్వగు చైత్రమాసాది గతచతుర్దశీ దినమున
నంబుధితో సంగమంబొందు వైశాఖశుక్లతృతీయాఖ్య శుభదినమున
సహ్యశైలముఁ జేరి చనునల్ల పుష్యమాసమునందుఁ బుష్య నక్షత్రమందు
మఱియుఁ బుష్యార్క యోగ, జన్మర్క్ష, గ్రహణ, పాత, సంక్రమ, ణాదిత్యవార, పూర్ణి
మా, దినత్రయ, దర్శ, యుగాది ముఖ్య, పుణ్యతిథులందుఁ గావేరి పుణ్య మిచ్చు.

చ. తనరుకవేరజానది ముదంబున నన్నము వెట్టి విప్రునిం
దనియఁగఁ జేసినంత వసుధాతల మెల్లఁగడంగి దాన మి
చ్చినఫల మబ్బి వాఁడు నివసించు వికుంఠమునందుఁ గల్పముల్
చనియెడునంతదాఁక నని క్ష్మాసతి మున్ను వచించె ధర్మజున్. ౨౧౧.

క. కావున గంగాదులలోఁ, గావేరియ మేటి యనుచుఁ గ్రతుభుజు లెల్లన్
భావించి సేవసేయం, గా వలయును భక్తి సర్వకాలములందున్. ౨౧౨.

వ. అని నారాయణుఁడు దానతిచ్చెఁ గావునఁ గావేరి సర్వోత్కృష్టయనిన నెల్లరు నన్నదిం బ్రశంసించిరి గంగయుఁ దనగర్వంబు సర్వంబునుం దిగఁద్రావి మాతృభావంబునం గావేరితో సఖ్యంబు వాటించి యథాగతకృతాగమన యయ్యె. అది గావునఁ గాత్యాయనీ, నీవిందు సందియంబుపడఁబనిలే దని పరమేశ్వరుం డానతిచ్చె ననిచెప్పిన విని సంతసించి, నైమిశారణ్యవాసు లవ్వలికథావృత్తాంతం బెట్టిదని సూతు నడుగుటయును.

## ఆశ్వాసాంతము.

సుగంధి. వేడికోలు రాకమున్న వేన వేలుసొమ్ములుం,
గూడునట్లు కోటికిచ్చి కోర్కెఁ దీర్చుదాత, మే,
లాడునాఁడు కృష్ణరాజనామ్ని జాక గుణాఢ్యునా,
యోడ దవ్వు సుబ్బరాయునోము నో మహామహా.

మాలిని. వెలుగుటపాలిప్రోఁడా, వేల్పుమన్నీల ఱేఁడా,
నిలుకడగలవాఁడా, నింగిపైనాటకాఁడా,
తలఁగనివగకాఁడా, తల్పరాకుండువాఁడా,
తులువలగమిసూడా, తోరపుస్నేహకాఁడా.

గద్యము. ఇది శ్రీమదనునాతనోభయకవిమిత్ర, వెంకటయజ్వాగ్రపుత్ర, సమారాధితవిబుధ రాజ, శ్రీపాద-కృష్ణమూర్తికవిరాజ ప్రణీతంబైన కావేరీచరిత్రంబను పురాణరత్నంబు నందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ

# కావేరీచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీసుబ్బారాయాహ్వయ, ధీసచివవరావనైకదీక్షాశరణా
భాసురకరణా వేద, వ్యాసాదిమహామునీంద్రవందితచరణా. ౧.

---

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె నట్లక్కవేరుండు లోపాముద్రం గొనిన వెనుక జరిగినవృత్తాంతంబు చెప్పమనినఁబార్వతికిం బరమేశ్వరుం డిట్లనియె. ౨.

చ. వనిత, కవేరుఁడత్తటిని వారిజసంభవదత్తయైన య
త్తనయను దోడఁబెట్టుకొని, తారి, నిజాశ్రమభూమిఁ జేరి, స
ద్వినయవివేకసంపదలఁదేఁటి, కుతూహల మొప్పఁజేయుచా
మెను వరలక్ష్మి యంచు నిటు మిక్కిలిగా వినుతించె భక్తితోన్. ౩.

కవిరాజవిరాజితము.

జయజయ! దేవి, జగత్త్రియ సన్నుత శక్తి విహారిణి, సారగుణే
జయజయ! దేవి, సమస్త జగజ్జన సంతత పాలన లోలమతి
జయజయ! దేవి, నిరస్తమహాముని సంచిత ఘోరతరాఘచయే
జయజయ! దేవి, శచీపతి మానస సారస నిత్యనివాస రతే. ౪.
జయజయ! దేవి, కుశేశయ సంభవ సమ్మతకృత్యపరమార్థసుతే
జయజయ! దేవి, జనార్దనకల్పిత సద్గుణశక్తిసమాకలితే
జయజయ! దేవి, మహేశ్వరవిగ్రహసాధుమిళద్వరసంహననే
జయజయ! దేవి, వశీకృతపర్వతశాసనముఖ్యసుపర్వచయే. ౫.

వ. అనివినుతించి మఱియును.

సకలచరాచరంబులను జరుపఁగఁ బెంపఁగఁ జేయు నేతవై
ప్రకటితసన్మహత్త్వమున భాసిలుచుండెడు తల్లి, నిన్నెఱుం
గక జడబుద్ధి నందినిని గాసెద సెంచుమహాపరాధ మిం
కకుటిలబుద్ధి సైఁపఁదగు నమ్మ! సతీ, యిది నీకు మ్రొక్కెదన్. ౭.

అని సన్నుతించి కవేరునకుఁ బ్రాంజలియై లోపాముద్ర యిట్లనియె. ౮.

నిరుపమకీర్తిసాంద్ర, భగణీవిబుధేంద్ర, తలంప నీకు వా
క్యరసకు హెచ్చుకుందులు ధ్రువంబుగఁగల్గవు మీర లిర్వురున్
గురువులు నాకు నీవిటు ననున్ నుతియించుట న్యాయమయ్యా, కూఁ
తుర నని వేఁడుకొందు దయతోఁ దుతఁజూడుగదయ్య మ్రొక్కెదన్. ౯.

అని వెండియు. ౧౦.

తలిదండ్రులకు సేవ దవిలి చేయునతండు స్వర్గలోకమునందు సౌఖ్య మందుఁ
దలిదండ్రులను గొల్చి వలఁగొను నాతండు భూమిప్రదక్షిణపుణ్య మందుఁ
దలిదండ్రులపదంబువులు చల్లుకొనునంతఁ దలర గంగాస్నానఫలమునందుఁ
దలిదండ్రులమొదంద లలరఁ జేయునతండు సర్వదేవప్రీతి సౌఖ్య మందు
బ్రదికియున్నప్డు తద్వాక్యవర్తనంబు, వెనుక నేఁటేఁట మృతతిథి విప్రపూజ
యవలఁగయఁ బిండదానంబు నొసఁగుమాఁటఁ, బుత్రులకుఁ జెల్లుఁ బుత్రత ధాత్రిలోన.

గురునిం దల్లిని దండ్రినిం ద్విజులనుం గోపించి హుంకారముల్
సారిద్రిం జేయుచు ధిక్కరించు నతఁ డాసోమార్కతారంబుగా
నరకంబంది యనంతరంబున నరణ్యప్రాంతదేశంబునం
బరివర్తించును బ్రహ్మరక్కసియునై ప్రోల్లాలి పాపాత్ముఁడై. ౧౨.

గురువర, నీకు నే ననఁగుఁ గూరుమఁ గూఁతురఁగాన భక్తిమై
రతము సేవసేసెద ననింద్యచరిత్రుఁడ వీవు నీకు నే
నరయఁగ నెవ్వసేయునగు నయ్యవియెల్ల ను దెల్పుచుండు మి
క్కరణిఁ వచించెఁ జుమ్మి యలకంజభవుండును నన్ను నిచ్చుచోన్. ౧౩.

అని కవేరునొడంబరిచి దినదినంబును లానీత పూజార్థ పుష్ప పత్ర ఫల కంద మూలయు, సమ్మార్జిత వేదికయు, ఆనీత నిత్య కర్మానుష్ఠాన జల బర్హి రాదికయు నై సేవింప నతండు నటరి యయ్యాశ్రమంబున నింద్రాది బృందారక బృందంబులతో ననుదినం బానందించుచు సుఖంబున్నంతం గొంతకాలమున కకావేరి తండ్రి కిట్లనె

## కావేరి గురుననుమతిఁ దపంబు సేయుట.

చ. మునికులవార్ధిచంద్ర, విను పూర్వమునందుఁ జతుర్ముఖుండు న
ల్పవతప మాచరింపఁదగుఁ గన్నియ, నీవని చెప్పె నంతయు
న్మనమున నీకునుం దెలిసి సల్పఁగుచున్నదియే కదా! దయం
గనుఁగొని నాకు నాజ్ఞ యిడఁగాఁదగు భక్తిఁ దపం బొనర్చెదన్. ౧౫

వ. అనుడుఁ గవేరుం డనుమతించి తల్లీ, నీయుల్లంబు వచ్చినవిధంబునం బ్రవర్తిల్లుమనిన నక్కావేరియును. ౧౬

చ. పితరులయాజ్ఞ నట్లు కొని, పెంపగుభక్తియు నిష్ఠ యొప్ప నా
క్షితిధర కన్యకా ధవునిఁ జిత్తమునందున నిల్పి, కుంభజుం
బతిఁగ వరింపఁగోరి, సుతపం బొనరించె మహామునీశ్వరుల్
నుతు లొనరింపఁగా నపు డనూనఫలప్రద కాననంబునన్. ౧౭

సీ. పవలు రేయును రెండుపర్యాయములు తిని గురుతరంబు తపించెఁ గొన్ని నాళ్లు
పవ లేదిరే యొక్కపర్యాయము భుజించి గురుతరంబు తపించెఁ గొన్ని నాళ్లు
పట్టపగట నొక్కపర్యాయము భుజించి గురుతరంబు తపించెఁ గొన్ని నాళ్లు
పవలు రేయును నొక్క పర్ణమేగుఁడువక గురుతరంబు తపించెఁ గొన్ని నాళ్లు
ఓలి రెండును మూఁడును నాలు గైదు, నాఱు నేడును నెనిమిది యాఱుమూఁడు
బదియు రోజుల కొకొక్కపరి భుజించి, గురుతరంబుగఁ దపియించెఁ గొన్ని నాళ్లు. ౧౮

ఉ. మొట్టక లేచి, కాలు తొడమీఁదఁదగుల్కొనఁ జేసి, యొండుకా
ల్మొట్టనవ్రేలు నేలపయిఁ బొల్పుగ నిల్పియు, నూర్ధ్వబాహుడై
నిట్టన నిల్చి, భానుకుని నిర్భరతం గనుఁగొంచు, నెమ్మనం
బట్టిటు పోవ నీక, తప మాఘిహిరా స్తమయం బొనర్చెదున్. ౧౯

చ. కనకనలాడు నిప్పులను గ్రక్కుడు వేసవిఁ బంచపహ్నిమ
ధ్యంబున నిలిచి, కాక్షి క్కాల్లదిష్టి తర్లఁగ నీయని వానకాపురే
లనవరని బండఁబండి, హిమ మొయ్యనఁ జిమ్మెడుసీతువేళ నీ
టుపం తలబంటిఁ ముగ్గి, ప్రకటంబు తపించె మునీంద్రుఁ డెన్నఁగాన్. ౨౦

సీ. కల్లనై నన్యతంబు వలుకదు జంతుహింసాకర్మ మనఁగ నెన్నాఁడుఁ దలఁచు
నవివేకుల యదృచ్ఛ నైన మాటాఁడదు వృథగ వాగ్వ్రియము గావింపఁబోదు

మిత్రుల నెక్కసమను గాఁజూచెడుఁబగులజాడలు విని పరితపించు
జననమరణము లసహ్యంబు లని రోయుంచు నిహసుఖం బన్నచో సేవగించు
జలస్థము లైరాజదేజరిల్లు, జంగమస్థావరంబుల సంఘమందుఁ
సమశివబుద్ధి నిల్చి శాంబరము నూగుచుఁ, గొలఁదిమీఱె లోపాముద్ర గుణసముద్ర.

క్కన్య యనన్యసామాన్యంబుగ మునులు దలంకఁదపంబునం బ్రవర్తించుచుండె. అత్తపోమహాత్వంబునఁగ పేసుండు గుబేరసదృశుండై యొప్పి, ముప్పదిరెండుయజ్ఞంబులు సంపూర్ణదక్షిణాకంబులుగా నొనరించి, విప్రజనంబుల గోభూహిరణ్య రత్నాంబరాభరణాదులఁబరితుష్టి నొందించె. అతనియాశ్రమంబున క్షుధితుండును, బిపాసితుండును, దరిద్రుండును, దుఃఖియు, మందభాగ్యుండును, మందుడునైన నెక్కడనుం గానరాఁడు. ఇట్లధిక వైభవంబునం దేజరిల్లుచుండఁబదివేలవర్షంబు లతిక్రమించె నప్పుడొక్క దివసంబున. ౨౨.

## అగస్త్యుండు లోపాముద్రం బెండ్లియాఁడుట.

మ. మున్నీశెల్లను బుక్కిలించిన మహాత్ముం డయ్యగస్త్యుండు ది
వ్యాన్నత్యంబున నెక్కొనిజను వాఁడయ్యాశ్రమంబందునన్
మున్నీక్షించెఁగృశోదరిన్ గుణఝురిన్ భూతప్రపంచేశ్వరిన్
బన్నం బూఁడ భవాబ్ధి నీదుతరి లోపాముద్రికాసుందరిన్. ౨౩.

మఱియును నొక్కచో నూర్ధ్వబాహుయు, నాసాంత విన్యస్తలోచనయు, ఆపాద విగుప్త కేశయు, భూస్తత్వక్పరిధానయు, సర్వభోగవివర్జితయు, నై పరమేశ్వరు నేకాగ్రచిత్తంబున ధ్యానించుచుం దపంబున్న యక్కన్నియం, గని, యగస్త్యుండు దన ధైర్యంబు సర్వంబునుం దిగఁద్రావి, తదంతికంబునకుం జని, తన్నాలింగించి, నీతపఃఫలంబ నైవచ్చితి నన్నుం బతిఁగ వరింపు మనుటయు నామె యల్లనల్లనఁగన్నులం దెరిచి చూచి, బహుమానపురస్సరంబుగ నమస్కరించి, యర్ఘ్యపాద్యాద్యుపచారోపచితుల యథోచితాతిథిపూజ లొనరించి, యలరించి, పెనవేలు వరంబులం బడసి, మహాత్మా, సర్వాంతర్యాముల మగుమనకు దాంపత్యంబు భగవన్నిర్మితంబ; నీవు విష్ణుండవేని లక్ష్మి, నీవు శివుండవేని శివ, నీవు బ్రహ్మవేని సరస్వతి, నీ వింద్రుండవేని శచి, నీవు దేవుండవేని దేవత, నీవు మనుష్యుండవేని మానవి, నీవు పురుషుండవేని ప్రకృతి, నీ వయోనిజుండవే నయోనిజ, మఱియు నీ వేయేరూపంబు లందినఁ దాయారూపంబు లంది నిన్నుఁబొందుదు. ఇపుడుఁగ పేనునగన్యై నాన

నతండు దాతయై నన్ను నీకిచ్చి వివాహంబొనరింపుఁగాక; ''నదివై పుణ్యతీర్థంబులు దివ్యలింగక్షేత్రంబులునుం గలిగి పుణ్యప్రదవై లోకత్రయోపకారిణివై మెలంగు యిచ్చిన బ్రహ్మవరంబు దృఢీకృతం బగుఁగాత మని యొడంబరిచి, తదనుమ దండ్రికడ కరిగి కుంభసంభవాగమనం బెఱింగించిన నతండును సంరంభంబున మహామునులం గూడి యెదురేఁగి తోడితెచ్చి, భద్రాసనంబున నాసీనుం జేసి, ఇం ద్రాది దేవతలెల్లరు నుం బైనుండికనుచుండ, మధుపర్కం బొసంగి, నానాలంకారాలం కృతయగు నాలోపాముద్ర విధివ్రప్త విధానంబున నిచ్చి, విశేషవైభవంబున వివాహం బుగా గావించి, చతుర్థదివసాంతంబునఁ బ్రయాణాభిముఖియగు తను జాతం బిలిచి, తొడపైఁ గూరుచుండంబెట్టికొని, కన్నీటఁదడిపినశిరంబు పుడికి యుపలాలన సేయుచు నిట్లనియె.

కవేరుండు లోపాముద్రకుఁ బతివ్రతాధర్మంబులు సెప్పుట.

క. తల్లీ, భద్రంబగు నీ, వల్లభునింగూడి పోయి వచ్చెదవఁటె! నీ
వెల్లపుడు నతనిమాటల, నుల్లంఘింపక మెలంగు మొగి నీడ వలెన్.

సీ. పాదము ల్గడిగి నీపయ్యెఁటఁదడియొత్తి విభుని వీవనలతో వీవవమ్మ
భోజనాంతమునందు భుజియింపు తత్పాత్ర నిదురబొందిన వెన్క నిదురబొమ్ము
లేవకున్నప్పుడ లెమ్ము పిల్చిన యేనిఁజేఁబనివిడిచి చెచ్చెర గమింపు
పనియున్న సుఖసుప్తుఁడును సుఖాసీనుఁడు నైయున్నచో లేపకమ్మ యెపుడు
జీవితేశ్వరు సెవలోన సేవగించి, సారెసారెకుఁబోరెడు సాగసాక్షి
నీక్షణము సేయునొల్లకు మెల్ల వేళ, భయము భక్తియుఁ గదురంగ వలయు మెలఁగ

క. పరపురుషు లెంతసుందర, తరులైనం దమలటంచుఁ దల యెత్తకుమీ
పరుఁడెంత హీనుఁడైనను, పరదైవం బనుచు నమ్మవలయున్నాయీ.

తే. పసపు, కుంకుమ, కాటుక, వలయములును
భూషలు, కర్పూరపకంబును, ముక్కుఱయును
గమ్మలు, ఉంగ్రములు, కేశబంధమ్ము, కంఠ
సూత్రమును బాయుఁదగనివి సుదతి యెపుడు.

సీ. ఎపుడు భర్తాజ్ఞలే కుపవసింపఁగఁబోకు కలియఁబిల్చిన యప్డుఁజెల్లఁగఁజనుము
వలువ మాసిన నాఁడు పరుఁజూడ కధిపతిఁజూచి దివాకరుఁజూడక మును

మ. ఇది కడుముద్దరాలు సడి కింతయు నోర్వదు, తల్లిప్రక్క చా
టుది, గడిదేర దెల్లరఁదటుక్కున నేర్వనిమాట లాడు నె
య్యదనున నెట్టులుండఁదగు నయ్యది యేమి యెఱుంగ దక్కటా!
గదుమక నీవు నాదుకసుగందువు నెట్టులు చూఁతువో కదా! ౪౦.

చ. కడుపునఁగన్న కన్నియల కన్నఁబదింతలు పెచ్చునట్టిప్రే
ముడిఁగని పెంచి నీదుచెయి ముట్టగఁబెట్టితి నింక నీదువెం
బడిఁజను దెంచు నీనిసువుభార మదంతయు నీదిసుమ్ము దుం
డుడుకును దప్పసైఁచి దయతోడుత నేల్కొను మయ్య, యెప్పుడున్. ౪౧.

వ. అని యనేకవిధ ప్రార్థనా చాటుకారంబులగు వాక్ప్రకారంబుల నల్లునియుల్లంబు రంజిల్లం జేసి, కూఁతునకు నరణంబుగాఁ దనదు సర్వస్వంబు నొసంగి, మగనితో నంపిపుచ్చె. అంత నమ్మైత్రావరుణియు సకళత్రుండై కాశికాపురం బరిగి సుఖం బుండె. అపుడు కవేరుండు వివాహమహోత్సవ దర్శనాగతులగు నింద్రాది బృందారక బృందంబులం గని యభివందనం బాచరించి, భవదాశీః ప్రభావంబునను, గన్యాదాన మహాత్వంబు వలనను, గృతార్థుండ నైతి నింక నాకు వర్ణాశ్రమధర్మంబులు విని, ఘనతరంబగు తురీయాశ్రమ స్వీకారంబు నొందఁ దలంచి యున్నవాఁడ. అనిన దేవతలు "నీకోరినయది కైవల్యప్రదం"బని ధర్మము లెఱింగించుటకు బృహస్పతి న్నియోగించిన నతం డతని కిట్లనియె. ౪౨.

## గురుఁడు కవేరున కాశ్రమ ధర్మంబు లెఱింగించుట.

తే. ఇచ్చి కుడిచిన బ్రదుకును విచ్చు సురణ, తీర్థములఁజావు నరులకు సార్థకములు
రణమునను రాజునకును దీర్ఘముల మఁగురి, కలదు మరణంబు పుణ్యద మనిరి మునులు.

వ. సన్యసించి బ్రాహ్మణుండు పుణ్యతీర్థంబునం జచ్చె నేనిఁబునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోకంబు వడయుఁగావున నాశ్రమచతుష్కంబునం దురీయం బుత్తమోత్తమంబు. ఆదిక్రమంబున నెఱింగింతుఁబోలుత బ్రహ్మచర్యంబు వినుము. ౪౪.

తే. తలఁప గర్భాష్టమాష్టమాబ్దములు, మఱియు, నలుసఁబంచమషష్ఠాబ్దములను విప్ర
సుతులకుపనయనం బొనర్చుట కటంచు, నతులితంబుగవిన శ్రుతిస్మృతులు చాటు.

వ. ఉపనీతుం డగునతండు బ్రహ్మచారి నాఁబడు. అతండు గురుశుశ్రూషాపరతుండును అగ్నికార్య తపోనిర్వాహకుండును, నియతేంద్రియుండును, వేదాధ్యయన సంపన్నుండును, గురుగృహవాస్తవ్యుండును, భైక్షాశనుండును, స్నానసంధ్యాద్యనుష్ఠాన తత్

యందునుం గావలయును. అగ్నికార్యం బొనర్పక యుడుచుసతం డాతురుండై యేడు రాత్రు లవకీర్ణవ్రతం బొనర్పవలెను. కాంస్యభోజన, మధుపాన, మాంసభక్షణ, తాంబూలచర్వణ, స్త్రీనిషేవణంబు లోనగు పర్వప్రమాదంబులఁ జేసినబ్రహ్మచారి యవకీర్ణి నాఁబడు. అంత కొన్ని యుసనం బలితుం డగు. నిషిద్ధంబులం దొలంగి, యథోక్త కర్మల వేదవ్రతం బొనరించుచు, స్వశాఖామాత్రమైన వేదంబుఁ జదివి, స్నాతకుండై గురునకుం బసిఁడిలంటి దక్షిణ లొసంగి, తదనుమతింబునఁ గులశీలగుణలక్షణాదులఁ దన కనువగు కన్యకం బెండ్లియాడునది. ౪౬.

అతఁడు గృహస్థుం డనఁబడును, శ్రుతియందును నెల్లవారికిం దనియ నిడక నతుకమునఁ దానునుం దిన, నతనికి దాను నతనియుట్టిఁ డన్యుఁడు గలఁడే. ౪౭.

గృహస్థుం డాతిథ్యంబును, పంచమహాయజ్ఞంబులును, శ్రాద్ధస్వాధ్యాయనంబులును, నెరవేర్పునది. లేకున్నఁ బతితుఁడగు. మూఁడు నాళ్లుపోశన సంధ్యాపరిత్యాగి దుర్బ్రాహ్మణుం డనంబడు, సద్వక్ర్మబహిష్కృతుండగు. స్నానమాడకాశీవిషభోజియు, కర్మసేయక క్రిమిభోజియు, హోమమునర్పక విణ్మూత్రభోజియు, పెట్టక పూయశోణితభోజియు నై నిరయంబందు. స్వధర్మనిరతుండును, బరనిందా పరాఙ్ముఖుండును, శ్రాద్ధకర్తయు, సత్యవాదియు నగునతం డుత్తమలోకం బందుం కలియకున్న దురితంబు గావున దర్శాదిపర్వదినంబులం గాక, ఋతుదినంబుల నిజభార్యం గలియునది. ప్రాప్తకాలం బైన సమాధులం గులకాంతం బొందినవాఁడును, బరదారగమనంబొనర్చిన మహాపాపియు, రౌరవాది నరకంబులం బొందెదరు. ప్రత్యహంబును యజన యాజ నాధ్యయ నాధ్యాపన దాన దానప్రతిగ్రహాది శాస్త్రోదిత కర్మ లొనరించుచుఁ బుత్రోత్పత్తి గని, నడికాలంబుగా నింటియాలిడ నింట విడిచికాని విడువక కాని వనంబున కరగి, సభార్యుం డగు నేని సాగ్నిహోత్రుండై, గ్రామ్యాహార వ్యవాయంబులు దక్కిదక్కిన గార్హస్థ్య ధర్మంబు లొనర్చునరుండు వానప్రస్థుండు నాఁబడు. ౪౮.

ఇటులు కర్మ లొనర్చుచు నటవి నిలిచి, యాయువర్ధంబు నర్ధంబు నరుగుదాక నంతట విరక్తుఁడై భూసురాగ్రగణ్యుఁ డాచరింపఁగఁదగుఁదురీయాశ్రమంబు. ౪౯.

ఆ సన్యాసంబును కుటీచక, బహూదక, హంస, పరమహంసలననాల్గు దెఱంగులు. అవిక్రమంబున నాచరించునది. త్రిషవణస్నానంబును, జతుర్థయామ భైక్షాశనంబునుం జేయుచుఁ బుత్రమిత్రాది స్నేహంబునం దగిలియుండు ద్విజుండు కుటీచకుండు. కర్మశ్రద్ధాపరుండు బహూదకుండు. సంయతాత్ముండు హంస. పిన్నదైనం బెద్ద

యైన విరక్తుండు పరమహంస. త్రిదండ, భిక్షాపాత్ర, శిక్య, కమండలు, దర్భపవిత్రంబు లైదునుం గుటీచక బహూదకులు ధరించి, గాయత్రియుఁ, బ్రణవంబును, అష్టాక్షరియు, జపింప వలయు. త్రిషవణస్నానంబులు హంసపరమహంసలకుం గర్తవ్యంబులు. కుటీచకుండు నిందాస్తుతులంబలుకక, యేకాంతంబున నష్టాంగయోగనిరతుండును, జతుర్థకాలభైక్షాశనుండు నై పుత్రగృహంబున నైన నిలువ నగు. బహూదకుండు నిస్సంగుండై యొకచోటన నిలిచి యుండక వెనుకటి వాని నెల్ల నాచరించునది. హంస యేకదండవిధానంబున శిఖామాత్ర విహీనుండై బహూదక సమధర్మంబుల శుచియై సర్వభూతాతసముండగునది. పరమహంస శిఖాయజ్ఞోపవీత విరహితుండై దండమాత్ర ధారియై కర్మలతెలవునం బోక విరక్తుండై యుండునది. జ్ఞానంబునం గాని కైవల్య ప్రాప్తి లేదు గానసన్యస్తుండు, జ్ఞానంబు సంపాదించునది. లేక ప్రణవంబు నైన జపించుచు నుండునది. కానిచోఁబతితుండగు నివిమొదలగుధర్మంబు లిందుఁగలుగునని చెప్పినం గవేరుండు విరక్తుండై, తురీయాశ్రమ స్వీకారంబు గావించి, పరమ పదంబునొందె నని చెప్పి దేవదేవుండు కావేరీమహిమాధిక సూచకం బగునొక్కకథ తెలుపువాఁడై దేవేరి కిట్లనియె. ౫౦.

## త్రిగుణ్యుపాఖ్యానము.

క. దేవీ, పావన మగునీ, కావేరీమహిమ దెలుపుకథ యొక్కఁడునా
భావమునం బొడకట్టెను, నీవిప్పుడు దాని వినుము నే వివరింతున్. ౫౧.

చ. అతివరొ, తొల్లిటం ద్రిగుణి యన్ ధరణీసురుఁడొక్కఁడాలిఖో
శ్రుతినిచయంబులం జదువుచుం జనె గంగను జూడ నంతలో
నతులిత మర్ఘ్యపాత్ర మొనయం గొని కేల నెదుర్కొనెం బతి
వ్రతవలె గంగ రాకఁగని బ్రాహ్మణుఁడిట్లని పల్కెఁగుల్కుచున్. ౫౨.

క. ఎవ్వతె విద్వనమున నీ, వివ్విధమున నర్ఘ్యహస్త వెటువచ్చెదవో?
యెవ్వనిఁగొలిచెదు తలపున?, నవ్వా, యది చెప్పుమన్న నాయక యనియెన్. ౫౩.

తరల. అమరదీర్ఘిక నేను నిన్గను నాస వచ్చితి నింతద
వ్వమర నాదగు నర్ఘ్యపాద్యము లర్చలుం గొనుమీ యనన్
విమలవాక్యము లాలకింపుచు వీతకల్మషుఁడాద్విజో
త్తముఁడు మ్రొక్కుచు నిట్లుపల్కె నుదారవాక్య సముద్ధతిన్. ౫౪.

శా. తల్లీ, నాదగు మ్రొక్కు లీగొను మహాశ్చర్యంబునం జెల్వుమీ
తెల్లం బై తగురీతి నుత్తరము తద్విఖ్యాత వాక్కోటికిన్
వెల్లం ద్రుంపఁగఁ జెంప నంపఁగునుల శ్రీకాంక్షి జన్మించి ది
వ్యోల్లాసంబున నొప్పునీవు విక్రృతం బూహింప నానేమొకో? ౫౫.

వ. అనినం గంగ యిట్లనియె సద్యా, వినుము బ్రహ్మఘ్నుండును, సురాపియు, స్వర్ణస్తేయియు, గురుతల్పగుండును, గిరి సల్వురిం గూడినవాఁడు నియేవురును మహాపాతకులు. తల్లిదండ్రుల, నన్నదమ్ముల, నిల్లాండ్ర, గురుస్వాములం జంపినవ్రాండ్రు పాతకులు. పశుఘ్నుండును, పరపత్నీగుండును, పరపాకాశనరతుండును, పరద్రవ్యాపహారియును, పరనిందాపరుండు నను నిం ద్రుపపాతకులు. దేవబ్రాహ్మణదూషకులు, శూద్రాన్నభుక్కులు, శూద్రసేవకులు, వృషలీపతులు, నిషిద్ధమానుల శుల్కంబు విడిచిన వారు లోనగుపాపిష్ఠులు పాపశతసహస్రంబు లెల్ల స్నానమాత్రంబున మన్నీరంబులం గలిపి, దేవతానీత దివ్యానూన ప్రభాభాసమాన విమానంబుల నెక్కికొని, పరమపదం బరుగుచుందురు. ఆపాతకంబు లన్నియు నుదంగంబునం బరిణమించి వికృతిం గనఁజేసె. ఇది నేను ప్రతినిత్యంబునందుం దులామాసంబునఁ గావేరిం బోకడం బెట్టుచుందు నని మఱియును. ౫౬.

చ. దురితలతాలవిత్రమయి తోఁచు కవేరజఁజూచినంతనే
నరులకుఁగల్మషం బెడలు నానుడి సత్యము నమ్ము మిప్పుడ
య్యరుణగభస్తియుం దులను సల్లనఁజేరఁగ వచ్చు నాడ కే
నరిగెద నీవు రక్షనుమ నాయమ పొందెఁదిరోహితత్వముల్. ౫౭.

వ. మునిపుంగవుండు నాశ్చర్యమగ్నాంతరంగుండై, గంగాజలంబులం గృతస్నానుండై, సహ్యపర్వతంబుకడ కరిగి, కావేరింగని హర్షోత్కర్షంబునం బ్రార్థించి యిట్లనియె.

చ. అలరఁగ నక్కవేరసుతవై వెలుగొందియు భక్తకోటికిం
గలికలుషంబులం దొలఁగఁగా నొనరించెడు తల్లి, నీకుఁ బ్రాం
జలి నయి మ్రొక్కుచుంటి నిజసన్నుతి తోఁగని తెల్పుమమ్మ! నా
పలుకుల కుత్తరంబనుచుఁ బల్కు మొగిం దడనుజ్ఞ నొందుచున్. ౫౮.

తే. పరమకల్యాణి, కుంభసంభవునిరాణి, త్రిపథగామిని గంగ తా నిపుడు కల్మ
షమ్మునను నీ విపు డకల్మషమున నాదు, మదికిఁజూపట్టి రిది యేమిమహిమ? చెపుమ.

వ. అనినం భాగీరథీసహితయగు కావేరి యించుక నగి త్రిగుణి కిట్లనియె. ౬౦.

తే. త్రిగుణి, నేను మాతండ్రి ప్రేరేపణమున, నవని నెల్లర కుపకార మాచరింతు
నందునను బాపములు వొంద వధికనిర్మ, లమ్మునఁదలిర్తు నీవట్లుపొమ్ము సుకృతి. ౬౨.

వ. అని మఱియు నీవు యథాసంభవంబులగు పత్త్రి పుష్ప ఫల తోయాదుల నొసఁగినంత యుపకారంబు ప్రాణుల కొనర్పు మనినఁద్రిగుణియుం గృతనమస్కారుండై నిజాశ్రమంబున కేగి యతిథుల కాతిథ్యం బొసంగుచుండె నంత నొకనాఁడు విప్రవేషంబున నభ్యాగతంబగు మూర్తిత్రయంబున కర్పించి తత్ప్రీతిభావంబున వీతకల్మషుండై వెలుంగుచుండె నని శివుండు వెండియు. ౬౩.

## శ్యేన త్రిజట సంవాదము.

చ. వనితగొ, లోమశుం డనెడు వానినిఁగన్గొని యాసుయజ్ఞుఁ డి
ట్లను గురుతల్లజా, నదులయందు లసన్మహిమాధికంబునం
గనఁదగు గంగకన్న నధికంబు కవేరజ యంచు నాకు మీ
రనయముఁజెప్పుట న్మనమునందున సందియ మాపహిల్లెడుణ్. ౬౪.

వ. అనిన లోమశుండు వత్సా, యడిగినయర్థంబు దేటపడ శ్యేనత్రిజట సంవాదాత్మకంబగు నొక్కపురాతనేతిహాసంబు గల దాకర్ణింపుము. ౬౫.

చ పుడమిని మున్ను బీద బ  పుత్త్రిలఁగన్నతఁడాహితాగ్ని, శ్యే
నుఁడను ద్విజుండు, లూనితమనోరథుఁడై ఘనతీర్థయాత్రలం
దడవుచుఁగాశికాపురికిఁదారి యటం దగ సన్న్యసించి యు
న్నెడఁద్రిజటుండు నాన్నపతి యిట్లను వానికి నచ్చి మ్రొక్కుచుణ్. ౬౬.

తే. తీర్థములలోన నుత్తమతీర్థ మెద్ది?, నదులలోపల శ్రేష్ఠంపునదియు నెద్ది?
తెలియఁజెప్ప మనంగనాతిరుగుభిత్తుఁ, డిట్లు పల్కెను ద్రిజటునకొసక మెసఁగ.

తే. ధరణి నోరాజ, సాధుసందర్శనంబు, పుణ్యదం బగుతీర్థమై పొగడఁబడియె
బాహ్యతీర్థము లెన్నేనిఁబట్టిచూఁడ, దానితో నెన గావని తపసు లనిరి. ౬౭.

వ. అయినం జెప్పెదఁ బూర్వాపరసముద్రగాములగు నర్మదాదినదులకన్న జాహ్నవి శ్రేష్ఠంబు. దానికన్న నాసహ్యసాగరాంతంబు సర్వతీర్థమయంబగు కావేరి శ్రేష్ఠతరంబు. స్నానపానాదుల గంగాదినదులును, స్మరణమాత్రంబునఁగావేరియుఁబాపజాలంబులం బరిహరించుగావునఁగావేరి ఘనంబని కొనియాడంబడు. ౬౮.

శా. అంతేవాసివతంసమా, వినుము దేవారాధ్యుఁ డన్నారదుం
డెంతేభక్తిని గంగ నాడఁజని తా నీక్షించి గంగాయునిం

గాంతాకారతఁ బొల్చుదాని మదిలోఁ గష్టించుచుం బల్కె నీ
కాంతాంగంబునఁ గల్మషంబు గనఁగాఁ గా దీని కేహేతువో? ౨౦.

వ. అనవుడు గంగయును. ౨౧.

క. స్నాతల పాతక మంతయు, నాతల మోచుటను గాదె నాదేహమునం
బాతకము చూడఁబడె నన, నాతాపసవర్యఁ జిట్టలని దోషఁ గడకన్. ౨౨.

మ. జననీ, నీదగు పాప మంతయును నాశంబందుమార్గంబు గ
ల్గినఁ జెప్పందగు నన్న జహ్నుసుత పంకేజాతపాత్రా, కనం
జనుసహ్యాద్రిసమీపమందుఁ గసకాసంగంబు కావేరిలోఁ
దనర స్నానిన నచ్చోటన్ దురితముల్ దగ్ధంబగుం గావునన్. ౨౩.

క. దేవముని, నీకు నాకును, గావేరియు సర్వలోకగణములకెల్లం
గావంగ వెలసెఁ గాన్పున, నీ వేఁగుము మున్న యచటికే నును వత్తున్. ౨౪.

వ. అని భాగీరథి యంతర్ధానంబు నొందిన నారదుండును కృతనమస్కారుండై కావేరి
కరిగి, ప్రార్థించి ప్రసన్నంబు వడసి, గంగ సకల్మష యగుటకును నీవకల్మష వగుట
కునుం గారణంబు సెప్పుమని ప్రార్థించినఁ గావేరి యిట్లనియె. ౨౫.

తే. శౌరిపాదప్రసూత యీజాహ్నవికిని, బ్రహ్మమానసపుత్త్రినై పరఁగు నాకు
భేద మింతయుం లే దగనఁబ్బ్రభువి హరిగనా, ప్రసాదమునను బాపరహితనైతి. ౨౬.

తే. కడఁగి జగమున లోకోపకారిణి నగు, నాకు నితరుల పాపముల్ దాక వందు
వలన స్నాతలపాతకములు ధరించి, వెనుక నాకడఁ బోకడఁ బెట్టు గంగ. ౨౭.

వ. అని కావేరి దేవముని కెఱింగించిన విధంబు శ్వానుండు త్రిజటునకుం జెప్పె నని లోమ
శుండు బోధించిన శిష్యుండు సంతసించి కావేరితటంబున కరిగి, పిమ్మటఁ బరమపదంబు
నొందె నని శంకరుండు వెండియు. ౨౮.

## గంగాయమునా సంవాదము.

చ. నదులకు నెల్ల మేటియయి నల్వగు గంగకు నెక్కుడై మహా
నదియగు నక్కవేరజ ఘనంబని తేలు మనోక్కవృత్తముల్
బొదలు వచింతు విన్ము గిరిపుత్త్రిక, చిత్తము నొందుచోటికిం
గదలఁగనీక సందియము గల్గదు దీనిని విన్నయంతటన్. ౨౯.

సీ. ఒకనాటికాల మందకలుషయగు సూర్యతనయ నెచ్చెలి గంగఁ గనమి వగచి
తాను సరస్వతితో నెమకుచుఁబోవ నదికోటితో గంగ యెదురుపడియెఁ

దడిసినపుస్తంబు దలవెండ్రుకలు గ్రాలఁబొలుమజాహ్నవిఁగని మ్రొక్కి యమున
బాష్పధారలఁబాదపద్మముల్ దడుపుచు ననుకంప దోఁప నిట్లనియె వనట
తల్లి, యేమె? సర్వనదీమతల్లి, నీవు, నను నుపేక్షించి యెట కేగినావె? నీదు
కబరి, వసనంబుఁదడిసినకత మదేమి?, తెలుపు మనవుడు స్వర్గ్నది పలికెనిట్లు. ౬౦.

శా. కాళిందీ, విను నేను నీనదులునుం గావేరికిం బోయి, త
త్తీర్థాలంబుల నాడి, పాపసమితిం గ్రేడించి పోనాడి, వే
నీలో వచ్చుచునుంటి మందున మదీయాంగమ్ము సార్ద్రమ్మునం
గ్రాలుం గాని మఱొండుగాదు పగవోఁగం జూడు మోనెచ్చెలీ. ౬౧.

చ. అన విని సూర్యపుత్త్రి యను నమ్మ, మహానదికోటిలోన నీ
ఘనత వినంబడుం గద! యఖండతపోనిధులున్ సురాసురుల్
నినుఁదగఁగొల్తు రెప్పుడును నీవొకసన్నినవాఁక కేగుటల్
విన వెరఁగయ్యె నంతయును వేడుకతోడ నెఱుంగఁజెప్పవే. ౬౨.

వ. అనిన నదియంతయుం జెప్పెద మొదట నాచరిత్రంబు విను మని గంగ యిట్లనియె.

సీ. తొలుత నబ్జజుకమండలువునఁదీర్థమై వెనుక నారాయణాంఘ్రిని జనించి
యంత భగీరథు డర్థింప శివుజటాగ్రమునుండి హిమవచ్ఛిఖరమునందుఁ
బడి పాఱి జహ్నునికడుపునఁజొరి సాగరముఁజేరి పొదలెడ రమణి, నేను
పతనవేగమున నాపాతాళముగ మహిభేదిల్లెఁదత్పాప మూదెనన్ను
దానఁదద్దోషశుద్ధికై నేను వర్ష, వర్షమును రవి తులఁజేరువాసరములు
మూఁడుపదులును గావేరి నాడి వచ్చు, చుందుఁగాళింది, డెంద మానంద మంద.

క. సాధుల కెవ్వం డహితం, బీధర నొనరించు వానికిహపరసుఖముల్
బోధయు నశించు నంచును, మాధవుఁడెఱిఁగించె మునిసమాజముతోడన్. ౬౫.

వ. ఇంకఁ గావేరిమహత్వంబు వినుము. ౬౬.

## గంగ యమునతోఁ గావేరీతీర్థమహత్వము చెప్పుట.

తే. బ్రహ్మచే ఘును బ్రార్థింపఁబడి యగస్త్య, నాలియయ్యె లోపాముద్ర యనఁగఁబరఁగి
యల కవేరుని కూఁతురై హరినిఁగొలిచి, వరము లంది సుతీర్థమై పరగుచుండు. ౬౭.

వ. కావేరీనదీ జన్మస్థానంబగుసహ్యగిరియందు సప్తర్షికుండంబును, బ్రహ్మకుండంబునుం గలవు. అందాడినవాఁడు బ్రహ్మపదంబు నొందుఁ బిదపఁగ్రమంబున నగుతీర్థంబులలో నాగతీర్థమందలి పేడినీరుద్రావినవాఁడు విషంబున కసాధ్యుండు, కనకాసంగమతీర్థం

బాడిన విష్ణులోకం బగు, నుత్తరతటంబునఁ దక్షకవనం బచటఁ దక్షకాహి తపంబు గావించెనందు మహానాగంబు లిప్పటికిని బొడసూపు, దక్షిణకూలంబున నర్ధచంద్రగిరియుఁ దత్పార్శ్వంబున మత్స్యదేశంబును గల దచట మత్స్యమూర్తి శివలింగంబుఁ బ్రతిష్ఠించె, దాని కొక్కక్రోశదూరంబున నుత్తరతీరంబునఁ బసుపునిగ్గులు దేరు దేవకపర్వతంబు. అందుఁ బసుపుంచి సువ్యక్తునికూఁతురు కావేరీసంగమంబు నొందె; దక్షిణతటంబునఁ గల్పకగిరియు, నసలఁగిసలాసంగమంబును, గజారణ్యంబును, శిలాతలవిభేదంబును, గోముఖంబును, ఘృతమధ్యంబులు; పిదప శ్రీరంగంబును జంద్రపుష్కరిణీతీర్థంబును గలదట రంగనాథుండు పరంధామం బొసంగు; ఉత్తరప్రతీరంబున వేదారణ్యక్షేత్రం బక్కడఁ జతుర్దంతుండు శంకరు నారాధించి గజేంద్రుండయ్యె; మాఘశుక్లషష్ఠియు, వైశాఖకృష్ణషష్ఠిసప్తమిలును, మీనకన్యామాసపంచములును, వృశ్చికమాసచతుర్దశియుఁ, బంచమీభానువారంబులు నచట నీరాడినవారి కత్యంతఫలప్రదంబులు; తరువాత దక్షిణతీరంబున సుధాస్థలం బచట విఘ్నేశ్వరుం డీశ్వరు నారాధించి గణేశ్వరుండయ్యె; అప్పలఁగుంభఘోణంబు గురుఁడు కుంభగతుండగునపుడును, మఘాన్విత మాఘపౌర్ణమాసియందును స్నానార్థ మెల్లనదులు నరుదెంచు నపుడటఁ గుంభేశ్వరుండు దర్శనమాత్రంబున పుణ్యం బొసంగు; ఉత్తరతటంబున జంబుకేశ్వరస్థాన మచట శిలాదుండు శివునిం గొలిచి నందికేశ్వరుం గనియె, సప్తమాతృకలుం గృతకృత్యలైరి, ధర్ముండు వృషంబయ్యె; దక్షిణంబున సుగ్రీవేశ్వరక్షేత్రం బచట దుర్గ శివు నారాధించి మహిషాసురుం జంపెఁ, బిదపఁ బద్మేశ్వరుం డతనిఁ గొల్చి తిలోత్తమ సౌభాగ్యంబు నొందె. అచటఁ జంద్రేశ్వరుండుండు. అట సింహమాసంబునఁ గృష్ణపక్షషష్ఠియందు నధికఫలంబగు; దక్షిణరోధస్సున బ్రహ్మేశ్వరస్థానంబును; మఱియు ననేకపుణ్యతీర్థక్షేత్రంబు లుత్తరదక్షిణతటంబుల గలవు; చివర సాగరసంగమతీర్థం బుత్తమోత్తమంబు. అని వెండియును. ౭౮.

తుల రవి చేరియున్న నెలఁ దోయరుహానన, యీడ కేగి నే
నిలిచెద మూఁడులోకముల నిల్చెడు తీర్థము లెల్లఁ దజ్జలం
బుల నపుడుండు నట్టియెడఁ బూరుషు లాడిన మోక్ష మబ్బు నీ
పలుకులయందు సుంతయునఁ బట్టకు దబ్బర నీవు నమ్ముమీ. ౭౯.

అనిన సూర్యతనయ మనంబున నలరి గంగాదినదులం గూడి కావేరి కరిగి దురితంబులం దొలంగి సుఖంబుండె. ౮౦.

ఉ. నా విని సంతసించి గిరినందిని యిట్లను దేవదేవునిం
దేవర, నాకు వా కిడఁగదే! కనకానది వృత్తమంతయు
న్నావుడు శంభుఁ డక్కనక నాకులయక్షిణి తా సుయజ్ఞపు
త్రీప్రకృతయ్యె కవేరునినదిం బడి పాఱె సముద్రమంటఁగన్. ౯౧.

వ. అనిన విని గిరినందిని సుయజ్ఞనందినియు గనకయుం గలిసి కావేరీసంగమంబు నొందిన విధం బెట్లనుటయు శంకరుండు. ౯౨.

## కనకాసుజ్యోతికోత్పత్తి ప్రకారము.

సీ. ధర సుయజ్ఞుండను ధరణీసురుండు సహ్యామలకగ్రామ మరుగుదంచి
శ్రీహరి గురియించి చేసె మిక్కిలితపం బతఁడుప్రత్యక్షమై యతనికోర్కె
నరసి సుజ్యోతికయను కన్య నొసఁగి నీ వికూఁతురును వేడ్క యొసఁగ మొసఁగ
గజరాజగిరి కేగి కడుభక్తి నచ్చట నివసించు యక్షిణి నెమ్మిఁగూడి
తప మొనర్పుడు మత్ప్రసాదమున నీమె, తీర్థరూపిణి యగునని తెలిపి విష్ణుఁ
డరిగె నంత సుయజ్ఞుండు నట్లుచేసి, తనువు విడనాడి వైకుంఠధామ మరిగె. ౯౩.

ఉ. అంతట నొక్కనాఁడలసుయజ్ఞునికూఁతురు నల్లయక్షిణీ
కాంతయుఁ జంత్రగాంత్రముల గాన మొనర్చుచునుండ నాడకు
న్నంతస మొప్ప వచ్చి సురనాథుఁడు చూచి సుయజ్ఞపుత్త్రికం
గంతునిబారిఁజిక్కి తనకాతుక మంత యెఱుంగఁజెప్పచున్. ౯౪.

ఆ. ఉవిద, నన్నుఁబొందు యుగసహస్రంబు లా, వెనుకఁ దీర్థరూపమును ధరింపు
మనిన నట్లుకాక యనుచు సుజ్యోతిక, తపనుమతిఁజెలంగి తనరుచుండె. ౯౫.

వ. అంతఁగొంతకాల మరిగిన వెనుక సుజ్యోతిక తపస్వినియగు యక్షిణింగని యిట్లనియె.

క. అమరపతినిర్మితంబగు, సమయమ్మున నరిగెఁబెక్కుసంవత్సరముల్
సమయ మిది విడిచి తనువులు, గమియింతమె! నదులమగుచుఁగడలికిఁజెలియా. ౯౬.

వ. అనిపలికి సుజ్యోతిక నది యగుటయునుం గని యక్షిణియుం దక్షిణంబ కనకయను పేరనదియయ్యె. అంతలో నింద్రుండు వచ్చి, సమయభంగంబు సేసి నన్నవమానించితిరి గావున మీ రల్పతోయలగుదురని శపించి, తత్ప్రార్థనంబునంజేసి మఱలఁ గరుణించి, అల్పకాలంబులో లోపాముద్ర కావేరియనం బొలుచు నపుడ మీశాప మోక్షంబగు ననిచనుటయు, వా రిర్వును భగండక్షేత్రంబునకుఁబోయి, కొంతకాలం బున కాగతయగు కావేరింగని నమస్కరించి, తదనుమతంబునం గలిసి వరుణాలయం

మహాస్రగ్ధర. జను తేవారినిఁబుణ్యాస్పదము శుభదముఁ సర్వపాపాపహంబై
చను నీయాఖ్యానముఁ సజ్జను లమరు నెడఁ సాధుదేవాలయాంతం
బునఁ గావేరీప్రతీరంబునను జదివినం బోల్చి విన్న న్నుతింపం
గను జీవన్ముక్తులై యాఘనులు శుభములం గందు రోమందయానా. ౧౧౦.

దినదినముం త్రిసంధ్యలను దీనిఁబఠించి యపుత్రకుండుపు
త్రునిఁగను నేటిలోన సిరిఁగోరుదు లందుఁగు దరిద్రుఁ డిద్ధరి
త్రిని శతవర్షముల్ మనుతలంప గతాయువు వేయు నేల నే
జనుఁడైన సిద్ధి గోరు నది సంభవమందు నసంశయంబుగన్. ౧౧౧.

అని శివకుం జెప్పెను శివుఁ, డని చెప్పిన నలరి నైమిశారణ్యమునుల్
వినవలతు ముఁదలికథయు, న్వినుపింపు మటంచు సూతుని న్వేఁడుటయున్. ౧౧౨.

ఆశ్వాసాంతము.

క. శ్రీమాస్థల్యపవిత్రగోత్రజుని, సుక్షిత్వథి ఖ్యాపేతు, కృ
ష్ణామాత్యాత్మజు, నర్థిలోకహృదయానందసంధాయి, స
త్ప్రామాణ్యవహుని, సాహితీనిధిని, సుబ్రాయుఁ జగన్ష్ఠేయునిం
బ్రేమన్ సంపదలిచ్చుచున్సతతమున్వీక్షించుమి శ్వేశ్వరా. ౧౧౩.

మాలిని. సురలకుఁదలకట్టా, సూదులంగొట్టుకట్టా
పరమమునులపట్టా, పాపులన్ముట్టికట్టా
వెరవుడిగినదిట్టా, వేలువుందాయచెట్టా
దురితములనుగొట్టా, లోకపుం దల్లివట్టా. ౧౧౪.

గద్యము. ఇది, శ్రీమదఘనాశనోభయమకపుత్ర, వేంకటయజ్వాగ్రపుత్త్రి, సమారాధితవిబుధ
రాజ, శ్రీపాద-కృష్ణమూర్తికవిరాజప్రణీతంబైన, కావేరీచరిత్రంబను మహాపురాణంబు
నందు ద్వితీయాశ్వాసము.

శ్రీ

# కావేరీచరిత్రము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీమచ్చినకృష్ణమురా, జామాత్యునిసుబ్బరాయ మధికశుభరాయు
శ్రీమహితకీర్తిగేయుం, గా మహి నొనరించి యే ల్సకలలోకేశా. 1.

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు చెప్పిన శంకరుం
జూచి శాంకరి యిట్లనియె. 2.

మ. వినుతాఖండయశోవిశేష, దయం గావేరీచరిత్రంబునుం
గనకాసంగమవృత్తమీవు దెలుపం గా వింటి సంకాశ మం
దెనునా చిత్తసరోరుహం బికను దత్తీర్థమ్ములుం క్షేత్రముల్
వినుపింపం దగు నన్న శంభుఁ డగజ న్వీక్షించి తా నిట్లనున్. 3.

చ. చెలియరొ, సహ్యపర్వతము చెంగటఁ గవేరునియాశ్రమంబునర
దొలుతఁ గవేరజానదిఁ గనుంగొన నొప్పెడు బ్రహ్మకుండమున్
సలలితతీర్థ మొక్కఁ డది సన్మునిమండలవర్ణనీయమై
సలిలము లంటినం దురితజాలములం బొలియింపఁ జేయుచున్. 4

వ. అందుఁ దులామాసంబున నొక్కనాఁ డాడినవాఁడు పంచ్రదశం చేఁదుదల గంగాదిన
ఫలం బందుఁ దొల్లి బ్రహ్మదత్తంబగు నగస్త్యకమండలు వటు సోఁకిగిల్లి గంగాజలంబు
కావేరింగలిసె దానం జేసి యది బ్రహ్మకుండంబు నాఁబడి బ్రహ్మదత్తవరప్రభావంబున
బాపాపహంబై యుండు. నరుఁడందుఁ దొలుత నఘమర్షణస్నానం బాచరించి క్షేత్ర
పాలురగు గణేశ కుమార హరి హర ధన దానంతులను సప్తర్షులను గొలిచి కృతకృ
త్యుం డగు. ఆమంబునఁ దీర్థశ్రాద్ధం బవశ్యకర్తవ్యంబు. ఏతత్ప్రభావసూచకంబగు
నొక్కకథ గల దది యెట్టిదనిన.

## బ్రహ్మకుండతీర్థవృత్తాంతము.

మ. వనితా, శాకలనామరాక్షసుఁడు పూర్వంబందు గర్వంబునన్
మునివేషంబున నెల్లెడం దిలుగుచుం బుత్తెంచి యిచ్చోఁ నగ

నెక్కికొని, విప్రునికడకు వచ్చి త న్నెఱింగించి నీకతన నిట్లు కృతార్థుండ నైతి నని తనకర్ణకుండలంబు లతని కిడి దివి కరిగి సుఖంబుండె. ౧౭.

తే. దేవి, తీర్థములందు భూదేవతలకు, నొసఁగనట్టులు భూమ్యాదు లొసఁగ వలయు నొసఁగనే నిట్టిశుభముల నెసక మెసఁగు, నొసఁగకున్నట్టి ధని పాప మొందు నిజము.

వ. ఉత్తమోత్తమంబగు కావేరీకనకాసంగమంబునం దొలుత జలమాడి, బ్రహ్మకుండంబున కరిగి గంగాదినదులం దలంచుచుఁ దీర్థమాడి బ్రహ్మయజ్ఞపితృతర్పణంబులును, పిండదానంబునుం జేసి, భూసురులకించుక సువర్ణం బొసంగి మూఁడునాల్గుదినంబు లట నిలిచినవాఁడు పురందరకల్పం బనిన విని గిరినందిని మనుష్యులకు దుర్లభంబు తెలియ నెఱింగింపు మనుడు నష్టేందుశేఖరుం డిట్లనియె. ౧౯.

క. దేవీ, నీయడిగినయది, దేవతలకు నెఱుఁగరాని తెఱఁ గది నీ కే నీవల నొకవచనమునం, దే వివరించెదను వినుము తెలియఁగ నెడఁదన్. ౨౦.

వ. బ్రహ్మస్వ దేవస్వ పితృస్వంబులును, యతి శూద్రానాథ సేవకవ్యభిచారిణీ విధవా జడ పంగ్వంధ పతిత పామరండి సురాప కృతఘ్నాదుల ద్రవ్యంబులును, దుర్లభంబులు; అవిహరించి కులంబు పోషించిన నది యగ్నివలన నింధనంబుం బలె నెఱియం జేయు. ఏకోద్దిష్ట నవశ్రాద్ధ మరణకాలికదానంబులు దుర్భరంబులు. ఇవి యిహపరసుఖాపహంబులు. ముదుకళ్లగు తలిదండ్రుల, గరితయగు నెలఁత, బుడుతఁడగు కొడుకునుం దన్నునుం బోషించుటకై దరిద్రుఁ డసత్ప్రతిగ్రహదోషంబు నొందఁడు. ఎట్టిదానం బైనఁ దీర్థంబులం బట్టరాదు. ఇది యిట్లుండ నిమ్మింకఁ దీర్థరాజంబగు నాబ్రహ్మకుండి కాతీర్థమహాత్వంబు వినుమని పెండిపరు. ౨౧.

మ. మునుఁ జండాలుఁ డొకండు దుర్జనుఁడు సంపూర్ణామయాంగుండు నే నెను గోహత్యలు బ్రహ్మహత్యలమల స్త్రీహత్యలు న్వేసవేల్ మునివిత్తంబు హరించెఁ బెంచె నఘము ల్ఘోరక్రియాకోటులన్ జనసంఘైకవిహారుఁ డాఖలుఁడు తత్సహ్యాద్రి వగ్గిలప్పుడున్. ౨౨.

తే. తలపక్లిన్నగాత్రుండై యాతఁ డలసి, ఘుంటికాతీర్థమున కేగి యంటియున్న చెమ్మటలు వాయ నొకనాఁడు సిసిరజలము లాడి పో దారిలో నసను బూడి పోవ[illegible]

[illegible] యమునిభటు లష్ట వాని సంయమని పురికిఁ దోడ్కొని పోవు స్వామిపసిడకుండు [illegible] ప్రాంజలి యగుచు నిట్లని పలికె నస్పురుష వినువార [illegible] [illegible] [illegible] తీర్థమునందు నీ [illegible]

నపుడ కని బిడ్డ విడి వచ్చినట్టిదాని, ననయ మంభా! యనుచుఁ గడు నలిచు దాని
వేల్పుటావునుఁ బోనిలేఁబెయ్య నల్ల, వ్యాఘ్రి మీక్షించె నేత్రపర్వంబు గాను. ౩౬.

వ. ఇట్లీక్షించి తత్క్షణంబ క్షుధాతుర మగు నాశార్దూలంబు కొక్కపటుఁగునం బట్టి కొట్ట
కొనుటయుం దడఁబడియుం జడియక దొడు కిట్లనియె. ౩౭.

మ. పులిరాజా, యిదె నాదు మ్రొక్కు గొని సమ్మోదమ్మున న్వినుమ నా
పలుకు ల్లోకమునందు బిడ్డలపయి న్వాత్సల్య మెవ్వారికి
న్గలుగుఁ భిన్నము లేక నీకుఁ బలెనే నాకుఁ సుతప్రేమ వ
ర్తిలుఁ జిత్తంబున నందుకే వగతు నార్తిం గుంద నా కింతయుఁ. ౩౮.

మ. ఇల మీజాతికి ధర్మమే! పశువుల న్వీక్షించి భక్షించుటల్
జలజప్రోద్భవుఁ డిట్లుచేసెఁ దొలుతం జావన్న నేనింతయుం
దలఁక మై నలుచక్కి నాఁని దయో! నాకూన నాపోక కే
వలనఁ గ్రుక్కెడు పాలురాయి నుసు రేవాటంబునం దాల్చునో! ౩౯.

చ. కటకట! లేచి నిల్వఁబడి గాటము గ్రుక్కెడు చన్నుఁబాలునుఁ
గుటుకనఁ గ్రోలలే దిటకునుం బడియుండిన చోట నుండె నె
త్తుట వస నత్తమిల్లుచును దొట్రిలుచు న్నిసు వేను నాఁకటం
మటమటలాడి మేసి చన మానరి వచ్చితి నీకుఁ జొచ్చితిఁ. ౪౦

వ. అని దైన్యంబు దోఁపఁ బులికి మఱియును. ౪౧

శా. వ్యాఘ్రాధీశ్వర, నే గృహంబరిగి నావత్సంబు వీక్షించి మే
నాఘ్రాణించి సుమంత చన్గుడిపి మిత్రాళి న్నిలం జేసి యే
శీఘ్రం బీడకు వత్తు మన్నిగొని నీజిహ్వాగ్రము న్నారికా
మై ఘ్రాణంబులఁ జొన్పుచుఁ రుధిరము న్మన్నించి గ్రోలం దగుఁ. ౪౨

క. వేలుపులగిడ్డిబిడ్డకు, బోలుందొలుచూలిబిడ్డ మునిముఖ్యునకే.
ప్రేలిమిపస్తువు బొంకం, జాలను వస్నంపు మయ్య, చయ్యనవత్తుఁ. ౪౩.

వ. అట్లయిన నావత్సంబు జీవించెడు నీయాఁకలియుం దీరు లేని నాఁడు సన్ను నా
త్సంబు పంపినదోసంబు నీకానన్నంబరొయ్యెడు. అని పలుకుచుం దనవత్సంబు
తలంపువచ్చినఁ దెచ్చు పెల్లుఁగు శోకంబు మాలంపలేక దాని నుద్దేశించి. ౪౪.

ఆ. వడిగ నాల నొవలి తిడి నాకి ముని మోరు న్మూంత జేసి చేసి దూర్పుబిడ్డ,
జనని నేను నీకుఁ జనుమానుకున్కులు గుడువ నైతిఁ బాలు గ్రుక్కెడైన. ౪౫

క. మతిమాలినగతి నే నిట్, క్షితిపైఁ బడవైచి కడుపుచిచ్చున నిట వ
చ్చితి నాఁకటిబల మాహా!, గతిచెడి పులి యీని తనదు కందుల మ్రింగున్. ౪౬.

క. ని న్నీజన్మమునకు నిఁకఁ, గన్నారం జూచునట్టి గతిపట్టునె? నే
నిన్నాళిక్రోలుపులి వా, త న్నిలిచెద నిచువ, నీవు నెట నిలిచెదవే. ౪౭.

వ. అని యనేకవిధంబులఁ బలవించుదానిపైఁ గరుణించి, దివ్యజ్ఞానలోలం బగుశార్దూలంబు తననోటిగోవు విడిచి పుచ్చి, నీవు నీ యిచ్చవచ్చిన మచ్చునం బోయి రావచ్చునని యంపిపుచ్చుటయు నాజన్నె కన్నుల నాజ్ఞ గొని, నిజోటజంబునకుం జని, దేనిఁ గన్నం గన్నతల్లి యని నల్గడల నరచుచు నూడనింబాడు దూడం గని, గూడఁబారి మూరుకొని, జాలుగొనుపాలపొదుగు దానిముట్టికడం బెట్టి, పొట్టనిండం జన్నుగుడిపి, నీకు నాకు నిదియు మొదలుం దుద యని కన్నప్రేగుగాన కనికరంబున కరంబు మేను మూర్కొనుచు, మేకొని నాకుచు, పొట్టక్రిందికిం జేర్చుకొనుచు, నుపలాలించుచు నించుకవిలంబనంబునుం గానీక లోకాతీతవిఖ్యాతమహితమహిముండగు కౌండిన్యమునికడ కడకువంజని, తన్నుతింగించి యిట్లనియె. ౪౮.

స్రగ్ధర. తాతా, నాప్రాప్తిహీనత్వము తమకెలనం దల్చుకో నేల! సాఁయం
ప్రాతర్హోమాదినిత్యవ్రతముల హుతభుగ్జ్వాలల న్నాదుపాలన్
నేతన్ ద్రేల్వంగఁ బుణ్యాన్వితనయి సుగతి న్నిల్తు నం చున్ననాకా
ప్రీతిం దక్కింపదయ్యె న్విధిబలము కడు న్వక్రపుసం బెన్ననాహా! ౪౯.

వ. అని విన్నవించి వెండియును. ౫౦.

సీ. దేవ, మిము న్వచింపఁ బులి జేరి నను న్వడిఁ బోయి రమ్మనెన్
గావునఁ గాలయాపనము గా దిట నాకిఁక భార మంతయున్
దేవరవారిమీఁద నిడి నే నిదెపోయెదఁ గాళ్లఁ వైచితిం
గావుఁడి పాలు ద్రావుటయుఁగాననినాకసుగందువక్కటా! ౫౧.

మ. పుడమిన్ బుట్టిననాటనుండియును మీపాపోష్యంబనై యుండి మీ
యడుగుల్మ్రొక్కుచు మీ శ్రుతుల్ వినుదు మీయందే మనం బుంచి యి
ప్పుడు మీదాస్య మొనర్చ నే సుగతి వాపుం జేయుదుం గాని యీ
న్నడుమన్నుం బాయక యుండునట్టి వరముం దానిచ్చి రక్షింపరే. ౫౨.

క. అని కాళ్లఁ బడిన మునియుం, న్వనరకు చిరకాల మీవు బ్రదుకుము సుఖతన్
జనిరమ్ము బాస తప్పకు, మని కుతికకు రక్షగట్టి యనిపిన నదియున్, ౫౩.

వ. సాష్టాంగదండప్రణామం బొనరించి వెంట వెంటఁబడినచంటిబుడుతం దోడుకుచుట్టాల కెల్ల నప్పనంబుచేసి, మఱిమఱిఁ దిరిగిచూచుచు విడువలేక విడువలేక దృష్టి మగిడించి యెట్టకే విడిచి పోయి శార్దూలవల్లభునకుం బొడసూపి, ప్రదక్షిణంబు నడుచుచు నో వ్యాఘ్రచూడామణీ, నీకరుణాకటాక్షవీక్షణంబునం జేసి నేఁ గృతకృత్యనై వచ్చితి నింక నీవు నీకార్యంబు నెరవేర్చుకొమ్మని వినయవివేక ధైర్య స్థైర్యంబులం బలికిన విని విస్మయమ్ము నొంది వివేకనిధియగుపసులదిండియు. ౫౪.

మ. బళిరే! యెంతటిదానవైన నగు దంబా! మేటి వయ్యారె! మి
క్కిలిఁగష్టంబు బలారె! ప్రాణములకే నాశింప వాహా! యస
త్యలవం బేనియు నంటవైతి వహహా! తాపీయఁ బోవైతి మేల్!
కలఁగం బోవు శబాసు! నీచరిత లోకస్తుత్య మా! బాపురే! ౫౫.

వ. అని ప్రశంసించుచు వెండియును. ౫౬.

తే. ఇచ్చవచ్చినమచ్చుఁ బోవచ్చు ననుచు, నప్పటికి నీ కుయికి నెన రొప్ప విడిచి
నాఁడ నిప్పుడు సత్యంబు నడపుకొనఁగఁ, దెఱుగఁ జనుఁదెంచి ప్రాణముల్దీయుమంటి.

వ. ఆహా! మహామునులకు నుపదేశకంబగు నీప్రవర్తనంబు నాకు మిక్కిలి మెచ్చు వచ్చె నింక నెప్పటికిని నీకు నీచుట్టాలకును నావలన నాచుట్టాలవలన నెట్టిభయంబును లేక యుండుఁగావుత. క్షుధాతురత నరయక నిన్నుఁ బట్టిననాతప్పు సైచి నీవు నీదారిం బోయి సుఖంబుండు మనిన నాహోమధేనువు ధర్మంబు తప్పని చొప్పున నిట్లనియె.

క. ననేఁ గనవుఁ దినెడుపసులకుఁ, బసులం దినుపులుల కిలను బాపము గలదే
యసదృశమగునీక్షుధ వో, మెసవుమి నీకైననాదు మే న్పులిరాజా. ౫౯.

వ. నీవు నీదైవకల్పితంబైన యాహారంబు గాదని పరిత్యజించి జీవాత్మ నాఁకట మటమట మాడించి దోషంబు మూటగట్టికొనక నాచెప్పినచొప్పునం జేయు మట్లుచేయించుకొ సుకృతంబు తెరువునం బోక రిత్తబోవుదానంగా ననుడు నప్పులియును. ౬౦

ఉ. ఎల్లగు ధర్మశాస్త్రి మనిరే ననసీ! పసిపిల్ల లాఁకటన్
జెల్లినఁ జెల్లనీ! యసురు చేడ్పడి పోయినఁ బోవనీ! యొడల్
ద్రెళ్ళినఁ ద్రెళ్లనీ! కొలముతీర్పులు తిట్టినఁ దిట్టనీ! యిఁకన్
దల్లిరో! నిన్నుఁ జంపికొన దైవముతోడు నిజంబు వల్కుతిన్. ౬౧

క. ఆఁకట మలమలమాడెదు, నీకసుగంధునకు బ్రోవు నీవే యగుటన్
వాకొనక మఱి నీఁకేమియుఁ, గైకొనినామాట చని సుఖంబున మనుమీ. ౬౨

వ. ఇట్లు చంపి తినుమనుష్యనరంబునకును జంపి తినఁజనుమను పసరంపుదిండికిని బెద్ద యుంట్రోద్దు పెద్ద వాదు పడియె. అయ్యవసరంబున నచటి కింద్రాదిబృందారకబృందంబులును మునికందంబులును నచ్చి, మెచ్చుచుఁ బులిపక్షంబు తీర్పుతీర్చి, సౌరభేయి నంపివుచ్చి, కావేరి గలంతకాల మట వ్యాఘ్రపాదంబునా భుక్తిముక్తిప్రదంబగు క్షేత్రంబగు నని వరంబిచ్చి, వ్యాఘ్రంబు నాశీరంబుతో విమానంబుపై నెక్కించుకొని స్వర్గంబునకుం గొనిపోయి రవ్వల వహ్నిపుష్కరిణీతీర్థంబు తత్ప్రభావం బెట్టిదనిన.

## వహ్నిపుష్కరిణీ తీర్థప్రభావము.

తే. దేవి, కావేరిపశ్చిమతీరమందు, వహ్నిపుష్కరిణీతీర్థవరమునందు
నాఁడె నేమహాపాతకుఁడైనవాఁడు, క్రతుభుజులుగొల్వరుద్రలోకముననిలుచు. ౬౪.

వ. ఆకావేరీమధ్యదేశంబున వాయుజేశ్వరసన్నిధానంబున స్నానమాత్రంబున రుద్రసాయుజ్యంబును, కుంభజేశ్వరదక్షిణదిగ్భాగంబున శిలారూపంబున నున్నకపిలనంటిన శివలోకంబును, అగు నచట మాఘమాసంబున భాద్రపదయుక్తమగు నమావాస్యయందును, తులామాసంబునందును బిండప్రదానం బొనరించినవారి పితరులు నరకస్థులు స్వర్గస్థులును వారు వైష్ణవులును వారు శైవులు నగుదురు. గంగాదినదుల నఱువదియేండ్లాడిననగుఫలం బట నొకస్నానమాత్రంబునన లభియించు నని మఱియును. ౬౫.

సీ. వనజాక్షి విను సూర్యవంశమందున విష్ణుమిత్రుఁడను భూపతి మిసిమి జెంది
వరసుమంతునిపుత్త్రిఁ బరమకళ్యాణి వాసవఁ బెండ్లియాడి తత్సతికిఁ బ్రియము
గా నామెపేరునఁ గట్టినపురమున భోగంబులను బొందుఁబోలఁతిఁ గూడి
హయమేధములు చాల నాచరించి యతండు దివిఁగీర్తనీయుఁడై తేజరిల్లి
యొకదినంబునఁ గావేరియొద్దఁ బిండ, మిడియె వహ్నిపుష్కరిణియక్కడఁ దదీయ
పితృపితామహు లపుడు పాపిష్ఠులైన, నిరయమును బాసి సాయుజ్య మరయఁగనిరి.

వ. సకృద్దర్శనమాత్రంబున ముక్తినిడు వాసవాపురంబున వహ్నిపుష్కరిణీతీరంబున శివుండు లింగరూపంబున నివసించి యుండు. ౬౬.

ఉ. వాసిగ వాసవాపురి నివాసముగా సుశనాఖ్యమౌని సం
త్రాసములేక పంచపవనంబులఁ జిక్కఁగఁ బట్టి నల్గడన్
భాసిలఁ బంచవహ్ని లొకపాదము నేలను నిల్పి పొల్పుగ
న్గోసిల్లఁ దపంబు వేదజననిన్ స్మరియింపుచు లక్షవర్షముల్. ౬౭.

తే. అంత నతని తపోవిఘ్న మాచరింప, నచ్చరలతో సురలగిడ్డి వచ్చుటయును
నేవు రూపరి లారూపయిట శి మందు, మనుచు శపియించెఁ గని దానియునివరుండు.

వ. ఇట్లు శపియించియుం బ్రసన్నుండై రఘురామపదస్పర్శ యోగ్యంబునం జేసి మోక్షప్రదవు గాఁగలవని మొదవునకు విశాపంబిచ్చె. అదియు సప్తహస్త ప్రమాణధనుశ్శతయుక్తంబును జతురస్రంబు నగు శిలయయ్యె. ఆచట వహ్ని జపియించి పుష్కరిణిం జేసె. రామేశ్వరాగస్త్యేశ్వరమధ్యంబున నున్నదానియందు బ్రహ్మకమండలువునందుం బలె గంగాది తీర్థంబులుత్పన్నంబులయ్యె. గంగాదుల పాపంబాకావేరియు దానిపాపం బావహ్నిపుష్కరిణియు హరించు. అటనారదుండును, నుశనోమునియు నిష్టార్థసిద్ధులం బడసిరి. ఆశిలాతలంబున గాయత్రి జపియించునది. ౨౦.

క. గాయత్రికామధేనువు, గాయత్రి సురద్రుమంబుగాతలకెల్లన్
గాయత్రియచింతామణి, గాయత్రికిఁ జాలుమనువు గలదే జగతిన్. ౨౧.

సీ. గాయత్రి నొకపరిగానంబు చేసిన వహ్ని పుష్కరిణిలోఁబడయు సిద్ధి
ప్రాపిల్లు నొకపరిఁబఠియించెనేనియు వహ్ని పుష్కరిణిలోఁబడయు ముక్తి
యుపాసనాదికమనెనేని నొకపరివహ్ని పుష్కరిణిలోఁబడయు ఫలము
ఆగ్నేయమంత్రంబు నగ్గింప నొకపరి వహ్నిపుష్కరిణిలోఁబడయు సర్వ
మనుచు మూర్తి త్రయోక్తమై తనరుఁగాన, నచట నీరాడిరామేశునరసి నంత
నెట్టి పతితుండునే నంచనెక్కి మెలఁగి, విష్ణుపదమున కఱుగునో వెలఁదిమిన్న.

తే. రావణునిఁజంపి పాపంబు రామచంద్రుఁ, డపుడు వహ్నిపుష్కరిణిలో నాడిపాపు
కొనియె నని తద్విధంబెట్టులనిన గిరిజ, కిట్టులని తెల్పె శంకరుఁ డెసకమెసఁగ. ౨౩.

సీ. నారాయణుఁడు రాముఁడై రఘుకులమున వెలసి సీతాంగనఁ బెండ్లియాడి
పితృశాసనంబున సతితో ననుజుతోడ నడవులఁ దిఱుగంగఁ గడఁగిపోయి
దేవి తస్కరుఁడైన రావణుఁ బుత్త్రమిత్రాదులతోడ గీఁటడచి పుచ్చి
సపరివారంబుగా సాకేతమున కేగి పట్టాభిషిక్తుఁడై ప్రజలనేలి
బ్రహ్మహత్యానివృత్తికై బంధుకోటి, తో విభీషణనీలసుగ్రీవహనుమ
దాదియోధులతో విభవాధికంబు, వెలయఁ జనుఁ దెంచెనపుడు కావేరికడకు. ౨౪

వ. ఇట్లు చనుదెంచి స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లొనరించి క్షేత్రోపవాసంబుండి గాయత్రీశిలాతలాసీనుఁడై నిగమమాతృకంజపియించి సువర్ణరత్నాది దానంబులొసంగి సీతాలక్ష్మణసుగ్రీవ విభీషణాదులచే నొసంగించియున్న యవసరంబున నటకు వ్యాసపరాశరబోధాయనాత్రిగౌతమవిశ్వామిత్రవశిష్ఠాది మహామునిపరివృతుండై కుంభసంభవుండు విచ్చేయుటయు శ్రీరాముండు వారినెల్ల గాయత్రీశిలాతలంబున నర్చించి అప్పుడగస్త్యుం డిట్లనియె. ౨౫.

తే. దేవ, గాయత్రిశిలయందు నావునాపి, స్వర్ణమునఁ గుక్షిగోప్రసవంబుచేసి
నీవు తమ్ముఁడును లింగముల్ నిలిపి భక్తిఁ, బూజ గావింపుఁ డనుటయు మునిఘుఁడెండి.
వ. రామచంద్రుండును సువర్ణంబున నొక్కగోవుం జేయించి నిలిపి దాని యుదరంబునం దూరి వెడలివచ్చి యుత్తరతటంబునం దన పేర నొక్క శివలింగంబు బ్రతిష్ఠించె. లక్ష్మణుండును దక్షిణతటంబున లింగంబు బ్రతిష్ఠించె. తక్కిన సుగ్రీవాదులును గోగర్భంబుఁజొచ్చివచ్చి లింగంబులం బూజించి రపుడు రాముండు గాయత్రీశిలాగతుండై కుంభజునింగని దీనికిఁ బేరెట్లువచ్చెం జెప్పుమనిన నతండిట్లనియె. ౭౭.

## గాయత్రీశిలావృత్తాంతము.

చ. నరవర, తొల్లి వేయు నయనంబుల వేలుపు వృత్రదానవుం
దురమునఁ జంపి పంపయినదోషము వాయఁ గవేరజానదిన్
బరఁగెడు నీశిలాతలము వచ్చి చతుర్ముఖునాజ్ఞఁ గొల్చెను
న్నరయవిదారితాఘ విబుధప్రకరార్చిత వేదమాతృకన్. ౭౮.

వ. ఇట్లా శిలాతలాధిరూఢుండై సురనాథుం డొక్కమాసంబు నిరాహారుండై జపంబు గావించె. అంత నాదేవియుం బ్రత్యక్షంబై బ్రహ్మహత్యం బెడబాపి భవచ్ఛేదితంబగు నీశిల మహాపాతకోపపాతకంబుల నడంచునని వరంబొసంగి యంతర్ధానంబునొందె. అనిన విని రఘునందనుం డమందానందకలిత హృదయారవిందుండై మునీంద్రుల నాశ్వాసించి తానును సపరివారుండై సాకేతంబునకరిగె. బుద్ధిమంతుండగు నగస్త్యుండును గలికాలంబున దుష్టబుద్ధులు ధనలోభంబున హరింతురను తలంపునం జేసి శిలారూపంబు నొందు గాతమని పలికె నందునఁ దస్త్రహాటకనిర్మితంబగు నాధేను విపుడు దృషద్రూపంబునం జూపట్టు. ఆ గోగర్భంబు దూరి వెడలివచ్చినవాఁడు పునర్భవంబు నొందఁడు. ఆ గాయత్రీశిలాస్పర్శనంబును అగస్త్యేశ్వర రామేశ్వర లక్ష్మణేశ్వరదర్శనంబును మహాపాతకంబు లడంచుననిన విని భవాని భవునింజూచి వహ్నిపుష్కరిణీ జన్మప్రకారంబు సెప్పుమనిన నతండు సెప్పినట్లు సూతుం డిట్లనియె. ౭౯.

తే. ఎపుడు నలువ మహాభూత సృష్టిచేసె, నపుడ పరమతేజంబు వహ్న్యర్కచంద్రు లనఁగ మూఁడు దెఱంగుల నవతరిల్లె, నివియు శివునకు నేత్రములై తలిర్చె. ౮౦.

వ. సూర్యచంద్రులు దపించి శివనేత్రంబులైన చోటులఁ దన్నామంబుల హ్రదంబులయ్యె. వహ్నియుఁ గృతార్థులగు పుష్పవంతులచే నపహాసింపంబడి యచట తపించి శివసాన్నిధ్యంబు గల్పించుకొని తత్ప్రసాదంబున నుచ్చంబగు ఫాలనేత్రంబయ్యె. అందున

నతనిపేర గయాశతాధికఫలదంబగు పుష్కరిణియయ్యె నచట సర్వదేవతాలోకంబులును మూఁడుపద్మంబులునుం బదునాలుగుకోటులు నలువదివేలును బుణ్యతీర్థంబులు నిలిచి యుండెనని వెండియు. ౨౧.

మ. తతపుణ్యంబగు వహ్నిపుష్కరిణి చెంతం గావ్యుఁ డొక్కప్పుడా
యతవర్ణాయుతము త్తమాంగయుత గాయత్రీమహామంత్రమున్
చితభక్తిం జపియింప నాతని తపశ్శ్రీభంగముం జేయ శం
కితులై యచ్చరపిండుతో సురలు సంకీర్తించి పంపించుడున్. ౨౨.

వ. గాయత్రియు దేవతా గోరూపధారిణియై సురలవిరిబోడులంగూడి చని పాదాంగుష్ఠంబున స్థాణువువలె నిలిచియున్న కవిం గని యిట్లని వితర్కించె. ౨౩.

చ. కటకట! దుష్టమీతనువు గాల్పనె పొల్పుగ నన్ను నిల్పి లోఁ
బటుతర భక్తిఁ గొల్చు మునివర్యుని నిక్కవినార్య వందితుం
గుటిలమనస్కురాలనయి గోమతిఁ గింపుచు నింపుడింపఁగాఁ
దటుకన నేనవచ్చితిని దానమొకింతయు లేక యయ్యయో. ౨౪.

వ. అని యంతఁ జెంతనున్న చెలులం గాంచి. ౨౫.

చ. ఇతఁడు మహానుభావుఁడు గృహీతదశేంద్రియుఁడు న్మునీంద్రుఁడు
న్నుతగుణుఁడు న్విరక్తుఁడు ననూనమహత్వ విసృష్ట భోజనుం
డతులిత వహ్నితేజుఁ డహహా! చెలులార, భవద్విలాసముల్
వితయకలంప విమ్మునిఁ జలించెడు నేరులు సంద్రమున్నలెన్. ౨౬.

వ. అని చెలులంబలికి వెండియుఁ దనమనంబున. ౨౭.

మ. అకటా! కష్టతరంబు సుమ్మి ధరనన్యాధీనజీవంబు నా
ప్రకటానుగ్రహమానియున్న మునినిం బ్రాల్మాలి నేనే తలం
పక హింసింపఁగవచ్చితిం ధరనెటన్ బాటింపకే మూఢుఁడు
న్వికలుండై తనుపెంచునట్టి తరువుం ద్రుంచంగదా నంచునే. ౨౮.

ఉ. నన్ను జపించు మాని కులనాథునకున్ వెలఁగంది వేలుపుల్
మున్నటు వేఁడ నియ్యకొని పోయెద నంటిని వచ్చి కార్యముం
దిన్నగఁ జేయకున్నపుడు ద్రెళ్లుమటంచును శాపమిత్రు లే
కున్న ననుం దలంచు మునినొంచుట గల్గెడు నేమిచేయుదున్. ౨౯.

తే. సురల శంపానరించినఁ జుట్టుకొనును, స్వజన వధ పాతకమ్ము పిశాచసఘాతు
కాత్మమగు నొనర్పక యున్నఁ గటకటా! వి, ధాతృ చెయ్యుల నెవ్వఁడు దాఁటఁగలఁడు.

అని వితర్కించి గోరూపంబున మునిహృదయంబునం జొచ్చి దర్శనం బిచ్చి వెలివచ్చె నతండును ధ్యానోపరతుండై బయల దేవవనితా సహితయగు దానింజూచి నీ వెవ్వ రేల వచ్చితనిన గాయత్రి యిట్లనియె. ౯౧.

కామధేనువ నేను గాయత్రిజపియించు నినుజూడవచ్చితి మునివరేణ్య,
నాతోడ స్వర్గమునకు రమ్ము నావుడు మోహితుండై విప్రముఖ్యుండెలమి
నను బ్రోవఁదలఁచితే ననయుమిచ్చటనుండు లోకేశ నీవున్న నాకమిదియు
నావిని గోవను దేవ, వయస్యలవిడిచి నిల్వఁగజాల గడియవీడి
యనుడు గవిరుల్ల వనితల ననునయించి, వేఱువేఱుగఁ బ్రార్థింపవారలలరి
మావచన మీవుచేయుము మీగోవునిలుచు, నంతకాలము నిలిచెద మార్యయిచట. ౯౨.

అని నతండట్ల కాక యని యనుమతించుటయు వారును గలిసిమెలసి యనేకవిధ గీతవాద్యాదులచేతను, భావగంభీర సుస్నిగ్ధ కటాక్షవిక్షేపాదులచేతను, అతిగౌరవ పూర్వక వివిధహాస్యవచనరచనాదులచేతను, నీవీవిస్రంసనవ్యాజోరుదేశప్రదర్శనాదులచేతను, విస్రంసమ్మూర్ధధమ్మిల్ల ప్రసూనకేశబంధంబులచేతను, గళచ్ఛిమంతసిందూరారుణీభూత కపోలకంబులచేతను, నా భార్గవు మోహపెట్టుటయు నతండును వధూమండల మధ్యగతుండును, కామగ్రహాక్రాంతచిత్తుండును నై యాలింగనచుంబన నఖక్షతదంతక్షత హంసపారావత శుకారవమణితాదులచేతను, పాదహస్తాది తాడనంబులచేతను, రతిమధ్యస్థాతి మనోహరప్రణయకలహంబులచేతను, వారల వేఱువేఱం గూడి క్రీడించుచుండె. అంత ననేకదివ్యవర్షంబు లతిక్రమించె నపుడు తపోభంగము దెలిసి భార్గవుండు తనమనంబున. ౯౩.

అక్కట! వహ్నిపుష్కరిణి యందున నీశిలవేదమాతృకన్
ద్రొక్కి విముక్తిఁగందునని మోదముతోడుత నున్న నాకు నీ
కెక్కడ దాపరించిరో కా! యింతులనన్ విషవల్లి సంతతుల్
చక్కని నా తపోమహిమ నన్నిలఁ లభించెను నా కథోగతుల్. ౯౪.

కన్నపుదొంగ లింటఁబడి కంచము ముంతయు గోలె నింటిలో
నున్న సమస్తవస్తువుల నున్నతి దొంగిలిపోయినట్లుగా
నన్నక నన్న వచ్చినను సారెకలంచి హరించినారరో
నన్నటనాఁటినుండియును పెంచిన నాసుతపంబు నీచెలుల్. ౯౫.

సనకాది స్తవనీయమైన తపముంజాలించి నా పాపమై
కనఁగావచ్చిన వీరినంటుకొని నా కాయం బపాయంబుగా

శునిమూర్కొన్న మహాహవిస్సనఁగ నీచుం జేరు వేదంబు నా
జననిందార్హమయుక్తమై తగియె ముక్ జర్చింప నిట్లయ్యెరో. ౯౬.
చ. కటకట! యెట్టిపాతకము గానక యెప్పుడు చేసినాఁడనో!
యిటువలె సంఘటించె నిపుడీ వెతలన్ వెడలించి నన్ను నె
ప్పటివలె నిల్పఁగాఁ దగినవారెవరుం జగమందు లేరు నా
పటుమహిమంబు సెల్లె నిలబాలిశుఁడైతి నిఁకేమి సేయుదున్. ౯౭.
వ. ఇట్లు మిగుల వగలంబొగిలి కామధేనువుంజూచి యిట్లనియె. ౯౮.
చ. తలఁపగ ధేనురూపమును దాలిచి వచ్చిన యట్టి నీవు ప్రాఁ
బలుకులతల్లి విట్టి నినుభావమునం దలపోయమన్న నన్
గలచి విమోహితాత్మునిఁగ గాటము చేసితి గాన నియ్యెడన్
శిలయయి పొమ్మటంచుఁ గవినిర్దయుఁడై శపియించె నెంతయున్. ౯౯.
వ. అనంతరంబ దేవకాంతలంజూచి. ౧౦౦.
చ. పొలతుకలార, మీరు నను మోసముచేసి మదీయసత్తపః
ఫలమును వమ్ముచేసితిరి భవ్యమొకింతయు లేక మీరిటన్
వెలకు శరీరమమ్ముకొని నిచ్చలు జాతికులాభిమానముల్
దొలఁగఁగఁద్రోచి వేశ్యలయి త్రుళ్లుఁడటంచు శపించె నిర్దయన్. ౧౦౧.
వ. అట్టియెడ పొరనుగ్రహింపుమని ప్రార్థించుటయు మీరు వేశ్యలయ్యు నీ తీర్థప్రభావం
బునం జేసి దివ్యపదంబు నొందంగలరని కామధేనువుంజూచి నీవు శిలయయ్యును రామ
చంద్ర పదస్పర్శనంబు జేసి పంచమహాపాతకుల పాతకంబులు దొలంగందోఁచుచు
స్వర్గంబునకు రాకపోకలు సేయుచుండుమని వరంబొసంగె. ఆకారణంబున
గాయత్రి శిలయయ్యె నమ్మునియు నా విశాల శిలాధిరూఢుండై జపించుచు శివప్రసా
దంబు వడసి ముక్తుండయ్యెనని వెండియు. ౧౦౨.
తే. మున్ను కౌశికుఁడనియెడు మునివసిష్ఠ, మౌని పుత్త్రశతంబును మడియఁజేసి
వహ్ని పుష్కరిణీతట వాసియగుచు, దపము గావించి కిల్బిషమపనయించె. ౧౦౩.
వ. ఇది వహ్నిపుష్కరిణీవృత్తాంత మవల వాసవాపురికి యోజనత్రయదూరంబున నర్క
క్షేత్రంబు గలదు తన్మహాత్త్వం బెట్టిదనిన. ౧౦౪.

## అర్కక్షేత్రమహాత్త్వము.

చ. సురముని వీణమీటుకొనుచు న్వడిగా నొకనాఁడు వాసవా
పురి కిరునాల్గుక్రోశములఁ బొల్చిన యర్కవనంబు చెంతలో

సరసి కవేరజానదిని నాఁడె మనస్స్మితంబు నొంది నా
సరసకువచ్చి తద్విధము సాఁగిన కారణమేమి తెల్పవే. ౧౦౫.

వ. అని ప్రార్థించిన నేను దానిమహత్త్వం బిట్లని చెప్పితి నది వినుము. ౧౦౬.

ఆ. విశ్వకర్మ కూఁతు నైశ్వర్యవంతురా, లఖిల సౌఖ్యకలితయగుచుఁ బ్రేర్మి
గూర్మిమీఱఁ దనకుఁ గూఁడి కాపురము సే, యుచును మగని వేఁడి కోర్వలేక. ౧౦౭.

వ. తనమగని తనుతాపంబంతయుఁ దండ్రికిం జెప్పి పరిదేవనంబు గావించుటయు నతం
డును. ౧౦౮.

తే. కూఁతు నూరార్చి యిట్లను గోర్కిమీఱఁ, దల్లి, పగవాని చల్లార్పఁ దపను వేఁడి
పోఁడిమియు నీకుహితముగా బుప్పఁబోఁడి, తనయు బాగడొందసుఖముగాఁ దనరుమమ్మ.

వ. అని కృతసమయుండై సమయప్రతీక్ష యొనరించుచు నొక్కనాఁడు. ౧౧౦.

చ. తనసుతకుం హితంబు మదిఁదార్పఁగ నెంచుచు నప్పుఁబట్టి లోఁ
జెనకుచు నీతతేజునిగఁ జేసిన సారవి యాడకేఁగినన్
గనుఁగొని యూఁడుమూర్తులును నాకడలీనములై వెలుంగఁగా
నొనరుచువేయుటంచుఁ బరమోత్సుకత న్వినుతించి వేఁడుడున్. ౧౧౧.

వ. నేను నట్లకాయని యువ్వరంబతని కొసంగితి నంత సంతసంబున నతండు నన్నారా
ధించుచు నాస్త్రీయంబగు పాశుపతయాగంబు ననేకాశ్వమేధయాగంబులు నాతీరం
బునం దొనరించి కర్మఫలదాయియుఁ గాలమూర్తియు సహస్రభానుండు నయ్యె.
అచట నిప్పటికిని యాభస్తంబు లగపడు నందు స్నానదానాదికంబొనరించి యర్కే
శ్వరు నారాధించువారికి మోక్షంబు కరతలామలకంబు. అది యుత్తమోత్తమక్షేత్రంబు
గాన నీమది నెమ్మదింబొదవెనని నారదుండు పరమానంద భరితుండయ్యె. అవల
హేమావతీసంగమంబు దానివృత్తాంబు వినుము. ౧౧౨.

## హేమావతీసంగమము.

తే. మున్ను యజ్ఞదత్తుండను భూమిసురుఁడు, గంగలో నగుతీర్థముల్ గలియఁ దిరిగి
పితరులకుఁ దృప్తిగల్గమి మతిఁ దలంచి, కదలి చనుదెంచెఁ గావేరికడకు నటకు. ౧౧౩.

వ. చనుదెంచి స్నానాదికం బొనరించి గోత్రనామంబు లుచ్చరించుచుఁ బితృదేవతలకు
నివాపాంజలు లొసంగిన వారును దివ్యులై పొడసూపి దివ్యలోకం బరిగిరి. అతం
డును సతీసహితుండై స్వర్గమరిగి సుఖించె. అట్టియెడ హేమభూపుండను చక్ర

వర్తియై జన్మించి యతండు తనపేర హేమావతి యను నగరంబు గట్టించి సురనర సేవ్యుండై ధరణిఁ బాలించి విష్ణుసాయుజ్యంబునొందె. అచట హేమావతీ సంగమంబు నాఁబడు తీర్థంబయ్యె నచట వసిష్ఠుండు సంగమేశ్వరుం బ్రతిష్ఠించి పూజించి యభీష్టంబులం బడసె. దూర్వాసశ్శప్తుం డంబరీషుండు నచటఁ దపించి పరమపదంబు నొందె. విష్ణుశర్మయను రాజరిపీడితుండై పురంబువిడిచి యటకరిగి యిష్టార్థంబులఁ బడసె. అదియే లక్ష్మణాసంగమంబను నపరనామంబునం బ్రవర్తిల్లుచుండు నటఁ గావేరి యుత్తరవాహినియై పుణ్యసంవర్ధనియయ్యెఁ బిదపఁ గణ్వతీర్థమహిమవినుము.

## కణ్వతీర్థమహాత్మ్యము.

తే. మున్ను హేమావతీసంగమునను హేమ, వతము నాఁబడు పురమొండు వరలునందు
వ్యాఘ్రకేతుఁడు చిత్రకేత్వాత్మజుండు, సాధురైవత మనువంశసంభవుండు. ౧౧౫

వ. అతఁడు వహ్న్యర్క పుష్కరిణుల నడుమ నూరు రాజసూయంబులు నన్ని యశ్వమేధంబులుఁ జేసి యేకపంచాశద్గ్రామంబులు కణ్వునకుం దక్షిణగా నొసంగె. ౧౧౬

తే. మునిని వంచించి మునిశిష్యముఖ్యుఁడు వసు, నాయకుఁడు గ్రామములును ధనంబునొడి
పాలసుండయి జూదంబు పాలుచేసి, ధనముఁ గొన్ని నాళ్లకుఁ గాలధర్మమొందె.

వ. నిస్పృహుండగు కణ్వమునియు నా గ్రామంబులు తనశిష్యులకెల్లం బంచియిచ్చె గురుద్రోహియగు వసునాయకుండు నిరయంబునం గ్రమంబునఁ దామిస్రతామిస్రంబులంబడి తప్తకుంభశిలాసైకత భోజనక్రిమిభోజనంబులు సేయుచు నఱువదివేయేఁడు లరిగినవెనుక బ్రహ్మరాక్షసుండై యుగాంతంబున శూద్రుండైజనియించి జాతిస్మృతియుం గలిగి కణ్వునిం జేరి రక్షింపుమని ప్రార్థించినం బ్రసన్నుండై యతం డి
నియె. ౧౧౭

క. వృషలా, కావేరికడన్, వృషవాహను నాదుపేర వెలసినహరునిన్
మిషలేకకొలువుఫలమా, విషయంబునఁ బడయఁగలుగు వేఁజను మటకున్. ౧౧౮

వ. అనిన వాఁడట్లుచేసి దోసంబులంబాసి సాలోక్యంబు నొందె నిది భుక్తిముక్తిప్రదంబగు తీర్థం బవల దక్షిణాతటంబున శ్రీనివాసపశ్చిమంబున శంఖతీర్థంబుగలదు దానికథ యెట్టిదనిన. ౧౨౦

## శ్రీనివాసశంఖతీర్థవృత్తాంతము.

చ. చదువఁగఁబోయి మున్నెలమిఁ జంద్రుఁడు దాఁ గురుపత్నిఁ గూడి స
మ్మదమున బిడ్డగన్నఁ గనిపొంపిరివోని కృధారసంబులో

గదురగుచుండుసుక్ క్షయివిగ్రస్తుని వేశపియింప ఖిన్నుఁడై
సుదతినిఁ బాసి సహ్యజకు సోముఁడుపోయి నుతించెఁ గేశవుక్. ౧౨౧.

వ. అతండును సంతుష్టాంతరంగుండై పొడసూపి వరంబు వేఁడుమనుటయుఁ జంద్రుం
డును. ౧౨౨.

క. దేవా, నా వెతదీర్పఁగ, భావంబునఁ దలఁచితేని వాచస్పతి శా
పావిలముడిగింపుము పేఁ, గాటింపవె బలము సుఖము గాంతియు మేనక్. ౧౨౩.

ఆ. అనుడు నట్లుకాక యని జగన్నాథుండు, శంఖపూర్ణవారిచంద్రు శిరముఁ
దడిపె నంత రుజలగడపి సోముఁడు తగ, శంఖతీర్థమపుడు సంభవించె. ౧౨౪.

వ. అచట సకలమునులును దపంబొనరించి సిద్ధిపడసిరి. రావణుం జంపి రాముండును, రాజులం గిట్టి భార్గవుండును, అహల్యంగూడి బిడౌజుండును జలంబాడి దురితంబులం బోకడంబెట్టి రచట స్నానంబు దారిద్ర్యదోషోపశమనంబు. దానికిఁ బురోభాగంబున శ్రీనివాసతీర్థంబుగల దచట వృషభస్థాపితంబగు నిమ్నస్థలంబు జూపట్టు. అమ్మధ్యంబున మహోక్షులు సంచరించుచుందురు. దానికిఁ బశ్చిమంబున దక్షిణవాహినియు నుత్తరదక్షిణంబులఁ బ్రాగ్వాహినియునై కావేరిపాలుపొందు. ఆ మధ్యంబున మహామునులు నివసింతురు. ఇంద్రుండోట్టి దిక్పాలురు నటకు రాకపోకలు సేయుచుందురు. అనంత తక్షకవాసుకిశంఖపాలురు యుగక్రమంబున నా శ్రీనివాసుం గొలిచియుందురని మఱియును. ౧౨౫.

శా. ఈ యుర్విన్ఘను గ్రటభుండనెడు దైత్యేంద్రుం డటన్నిల్చి త
ప్తాయఃపిండములక్ భుజించుచోగి నత్యంతోగ్రదీక్షుండవం
బా యింద్రాదులు వొట్రిలక్ సలిపె సత్త్వాపేతుఁడై యంత దై
తేయాభ్యర్థ్మమునందుఁ బొల్చి విధియుం దీపింపదేహద్యుతుల్. ౧౨౬.

తే. వరము వేఁడుమీసంగద వత్సయనుచు, సలుపపలుకుడు కైటభుండలరి యెల్ల
భువనముల నేజయింపగఁబోదుజయము, గూర్పుమననొనటంచు మేల్కొలిపె నతఁడు.

వ. వరగర్వితుండగు నప్పూరుషాధముండును. ౧౨౭.

అమరావతికిఁబోయి యమరులతోనింద్రు నడగించి వానిరాజ్యంబుఁగొనియె
సంయమనికి నేగి జముని దూతలతోడ నణగించి వానిరాజ్యంబునొడిచె
నవలావతికిఁజని యప్పతిభటులతో నడగించి వానిరాజ్యంబుబడసె
నలకాపురికి నేగి యక్షులతో శ్రీదు నడగించి వానిరాజ్యంబుగెలిచె

మఱియు నీ రేడుజగములు దిరిగితిరిగి, పోటుమానుసుల వెదకి పొడిచి గెలిచి
దేవదానవసేవ్యుఁడై తేజరిల్లి, సత్యలోకముజనె నొక సమయమందు. ౧౨౮.

చ. అటఁజని ధాతఁ గన్గొని కృతాంజలియై యిటువల్కు- దేవ, నీ
పటుతర సత్ప్రభావమున భాసిలు నవ్వరశక్తి యుక్తినేఁ
దటుకున నెల్లలోకములుదారతగెల్చితి నింక విష్ణునిన్
స్ఫుటముగఁ గెల్వఁగా మనసుపుట్టె గమింప ననుజ్ఞ వెట్టవే. ౧౨౯.

వ. అని తదను మతంబువడసి పాలకడలికడ కరిగి యట నారాయణుం బొడగానక విస్మితుండై యెటఁ జూతునోయని భూలోకంబున కేగి వెదకివెదకి కంతదఘ్నంబులైన సాగరంబులనెల్ల నెమకినెమకి సప్తనగద్వీపసముద్ర ముద్రితంబగు ధరాచక్రంబు సర్వంబును గల్పాంతంబున దిగ్గజంబులుం బలె గాలించిగాలించి యుచ్చుటనుం గానరాకున్నఁ బాతాళంబున కరిగె నా సమయంబున. ౧౩౦.

చ. ధరణీదేవత కంపమానయగుచుం దామోదరుం జేరి భ
క్తిరతిన్ వేయుదెఱంగులం బొగడి యార్తిం గైటభప్రాప్తమౌ
దురవస్థన్ వినుపించి ప్రోవుమనుడుం దోడ్తోడఁ జక్రంబునన్
హరి దైత్యేంద్రుశిరంబు ద్రుంచి వసుధన్మన్నించి ప్రోచెన్ సతీ. ౧౩౧.

వ. ఆ కైటభాసురుం జంపి శ్రీనివాసుండు శ్రీభూనీలాసహితుండై శ్రీనివాసక్షేత్రంబునం బ్రవర్తిల్లుచుండె. అది యెఱింగి యనంతుండు తనకొడుకు శంఖపాలునిం బిలిచి కావేరి కడ నౌద్దాలకాశ్రమంబున నున్న శ్రీనివాసుం గొలువుమనుడు నతండు పాతాళంబున నుండి యగస్త్యేశ్వర వాయవ్యదిగ్భాగమందున్న శంఖతీర్థప్రహ్లదంబు వెంట వెడలివచ్చి సేవించుచుండె నౌద్దాలకుండు నట ముక్తుండయ్యె. అటఁ గృతాది మూఁడుయుగంబులం గ్రమంబునఁ గపిత్థ బిల్వ జంబూవృక్షంబులు నిపుడు శ్వేతతింత్రిణీవృక్షంబును నిలుచు. శంఖతీర్థంబున కర్ధయోజన దూరంబున ముక్తిదంబగు గౌతమక్షేత్రంబు గలదు. అట ననేకశివలింగంబులు నాశ్రమంబులు వరలుచుండునఁట గౌతముండు తనపేర శివలింగంబునిలిపి గోహత్యం బెడబాపుకొనియె. దక్షిణతటంబున భార్గవక్షేత్రంబును శ్రీనివాసేశాన్యంబున నొకయోజనంబులో సంవర్తకస్థానంబచట నతండు వేదమంత్రంబుల నిష్టకలం బ్రతిష్ఠించి చయనంబు గావించె. ఆపస్తంబాశ్వలాయన కాత్యాయన బోధాయన భరద్వాజాది ఋషులును, హరిశ్చంద్రాది యిక్ష్వాకులును ననేక యజ్ఞంబు లొనరించిరి. అట గాయత్రీశిలాసమంబగు యజ్ఞశిల యొక్కటి యొప్పు. దానిపై నలుండు శివలింగంబు నిలిపి పూజించి పుష్కరాపహృతరాజ్యుఁడై

వెండియుం గొనియె. ఆసంవర్తకలింగంబునకు దక్షిణోత్తరంబులఁ గావేరియు నాగ్నేయంబున నాశిలయు నయ్యంతరాళంబున గాలవాశ్రమంబును బశ్చిమంబునఁ గౌశికాశ్రమంబును గౌశికేశ్వరుండును దత్సమీపంబున వశిష్ఠపుత్త్రుండగు కుండినముని యాశ్రమంబును తత్ప్రతిష్ఠితంబగు నందివాహనలింగంబును గుశనాభలింగంబును సంవర్తకలింగంబునుం గలవు. సంవర్తకలింగంబున కెదురఁ బనసాశ్రమంబును, హరిశ్చంద్ర కార్తవీర్యాది రాజకృత యజ్ఞవాటంబులును, శ్రీరామప్రతిష్ఠిత లింగంబును, గలవు. ఆ శ్రీరామనాథ లింగంబున కెదుర విశ్వేశ్వరలింగం బతని నారాధించి బోధాయనుండను సర్వవేదశాస్త్రసంపన్నుండొక సూత్రకారాగ్రగణ్యుండయ్యె. అతనిచే నట నొకవటంబు నిలుపఁబడియె. విశ్వేశ్వర పశ్చిమంబున నరవిందాక్షుం డతని భృగు వారాధించుచు నట నొకయశ్వత్థంబు నిలిపె. దానిమూలంబునం గూరుచుండి యాజ్ఞవల్క్యుండు తపంబు గావించె. అగస్త్యప్రతిష్ఠితంబగు నావిశ్వేశ్వరారవిందాక్షు మధ్యప్రదేశంబు గాశీసదృశంబగు. సుగ్రీవకరచ్యుతంబగు నీలగిరిపార్శ్వంబున ద్విధాభిన్నయగు కావేరి యటం గలసిపోయె. నటఁ బశ్చిమతటంబున నగస్త్యుండు మఱియు నొక్కలింగంబునిలిపి పూజించె. దాని గన్నమాత్రంబున మానవుండు జ్ఞానియగు. దానికొక క్రోశమాత్రదూరంబునఁ గరోట్కటకాశ్రమంబు గలదు. అందాఱుమాసంబులుండి తపంబొనరించిన నరుండమరుండగు. ౧౩౨.

## కపిలాసంగమ మాహాత్మ్యము.

తే. అవ్వలఁ గపిలాసంగమ మనఁగ నొక్క, తీర్థ మొప్పెడు భుక్తిముక్తిప్రదంబు
సర్వమంగళ కెఱుఁగించె శర్వుఁ డొక్క, మా క్రమము చెప్పెద వినుండు తపసులార. ౧౩౩.

వ. అని సూతుండిట్లనియె. ౧౩౪.

చ. కపిలమహామునీంద్రుఁ డట గాదిలి పేఁడినఁ బొల్చినట్టి య
క్కపిల కవేరజం గలిసి గాటము వాలినటన్ స్పృశించె నే
నపగతకల్మషుండగుచు నాకమునం దమృతంబు గాక కా
శ్యపి స్తనదుగ్ధముల్జలల నానఁడు కన్గొన మర్త్యుఁ డెన్నఁడున్. ౧౩౫.

తే. కపిలనదియును గావేరి గలసికొనిన, పదము కైలాసమునకేన వచ్చుననుచు
మునులు మానవులును సురల్ మోక్షకాంక్ష, నచటఁ గాపురంబుండెద రనుదినంబు.

క. పరమేష్ఠియున్ మునులు, విరచించెన్ శివునిఁగూర్చి వేడుకనట నే
నదిశేని దానమాడిన, నిరయంబులఁబడక వారు నిలిచెదరు దివిన్. ౧౩౬.

తే. మఱి తులామాసమందును మకరయుక్త, మాఘమాసమునందును మహినిఁగలుగు
నెల్లతీర్థములక్కడ నెసకమెసఁగుఁ, గాననప్పుడు స్నానంబు ఘనతరంబు. ౧౩౭.
తే. పుణ్యదినములనటనాడు పురుషవర్యు, లుద్ధరింతురు నిరయమం దున్నయట్టి
వారిఁదలిఁదండ్రి మామనావంకవారిఁ, దనదుపెతరుల నేఁడుగోత్రములవారి. ౧౩౮.
వ. ఆ కపిలాసంగమంబునందు సనకసనందనాది మహామునులును, గరుడగంధర్వాది దేవయోనులును, శేషతక్షకాది పన్నగంబులును, యాజ్ఞవల్క్య పుత్త్రులును, లోకపాలురను, సప్తమాతృకలును, అప్సరోగణంబులును, పితృదేవతాగణంబులును, అనేకదివ్యవర్షసహస్రంబులు తపంబొనరించి నీలకంఠానుగ్రహంబువడసి సిద్ధిఁబొందిరి. ౧౪౦.
చ. ధనదుఁడు తత్ప్రదేశమునఁ దాభవుఁగూర్చి తపంబుచేసి త
ద్ఘనతరమైత్రి విత్తమలకాపురియుంగొనె శక్రుఁడట్టిదై
గొనెనమరావతీ పురమకుంఠితశక్తియుఁ గామధేనుక
ల్పనగములన్ సురాంగనల భవ్యవిభుత్వము సర్వసంపదల్. ౧౪౧.
వ. ఇప్పటికిని మహానుభావులాచోటనున్న సంగమేశ్వరు నారాధింపుచుందురు. గయాప్రయాగ వారణాసీ క్షేత్రత్రయఫలంబు గలదిగాన నటఁ ద్రిమకూటంబని క్షేత్రమయ్యె. కైలాసాదులకన్నఁ ద్రిమకూటంబు ఘనతరంబు తద్దర్శనంబున నరుండు పరమేశ్వరైక్యానుసంధానంబు నొందు. అచటి కాపురం బనంతఫలదంబు. సంగమేశ్వరునకుఁ బశ్చిమతీరంబున నుండి నరసింహుఁడాత్రిమకూటంబుఁ జూచుచుండు నచట శతకోటిసహస్రతీర్థంబులు సాన్నిధ్యంబుసేయు. ౧౪౨.
క. వరదుండై యట ఘటజే, శ్వరుఁడొప్పెడు నతని నమక వాక్యములలరన్
బరమాభిషేకమొనరుప, నరుఁడందున్ యజ్ఞఫలము నాకమునందున్. ౧౪౩.
ఉ. శ్రీరమణీయమై కపిలఁజేరినచో ఘటజేశుచెంగటం
గూరలుగాయలేనపుడు గూడిన విప్రులకున్ భుజింపఁగా
నేరిడికొల్తురా మనుజులెప్పుడనంత సుఖైకభోజులై
ధారుణినొప్పి శంకరుని ధామమునొందెద రంతమీఁదటన్. ౧౪౪.
క. అల త్రిమకూటమునందున, సలలితముగలోనియూర్పు సడలినరేన్ భూ
తలమునమఱలన్ బుట్టరు, ఖలులైనంగాననచటఁ గాఁపురమలరన్. ౧౪౫.
వ. అటనగస్త్యేశ్వర, సోమేశ్వర, మార్కండేయేశ్వర, హనుమదీశ్వర, [illegible]రేశ్వరులు పంచాయతనంబులు సద్యోజాతాది పంచముఖంబులై తలిర్చు. ఆ పంచలింగ దర్శనంబొనరించువారికి మోక్షంబు కరతలామలకంబు. అగస్త్యేశ్వరున కుత్తరంబునఁగాళ

నాథుండు నాఁబడు జగత్సంహార భైరవుండు క్షేత్రపాలుండై యుండు. హనుమదీశ్వరుని పార్శ్వంబున చండరూపిణియై చాముండి యుండు. దానింగని పాతకంబులూడ నింబాడు. మఱియుం బిశాచమోచనతీర్థ, గర్గతీర్థ, విశ్వతీర్థ, శక్తీశతీర్థ, కాళతీర్థ, మహావృషతీర్థ, గౌరితీర్థ, ప్రాజాపత్యతీర్థ, గౌతమీతీర్థ, స్వర్గద్వారతీర్థ, జంబుకేశతీర్థ, స్వర్ణతీర్థ, గయాతీర్థ, మహానదీతీర్థ, నారాయణతీర్థ, వాయుతీర్థ, వరాహతీర్థ, జ్ఞానతీర్థ, యమతీర్థ, అగ్నితీర్థ, గాంగతీర్థ, సోమతీర్థ, సూర్యతీర్థ, శ్రీతీర్థ, మణికర్ణికాతీర్థ, ఘంటాకర్ణతీర్థ, పితామహతీర్థ, నాగతీర్థ, యయాతితీర్థ, కపిలాతీర్థ, సోమేశతీర్థ, బ్రహ్మతీర్థ, భూతేశతీర్థ, గంధర్వతీర్థ, వ్యాసతీర్థ, దూర్వాసతీర్థ, చిత్రాంగదతీర్థ, చిత్రతీర్థ, విద్యాధరేశ్వరతీర్థ, కాలతీర్థ, కేదారతీర్థ, సారస్వతతీర్థ, భద్రకర్ణతీర్థ, ప్రభాసతీర్థ, హిరణ్యగర్భతీర్థ, గోతీర్థ, మహాలయతీర్థ, వృషధ్వజతీర్థ, వ్యాఘ్రేశ్వరతీర్థ, త్రిలోచనతీర్థ, లోలార్కతీర్థ, ఉత్తరాలయతీర్థ, కపాలమోచనతీర్థ, బ్రహ్మహత్యావినాశనతీర్థ, శుకేశ్వరతీర్థ, సనందనాదిదివ్యతీర్థంబు లారుద్రతీర్థంబున గలసి యుండు తత్స్మరణంబును మహాపాతకోప పాతకహరంబు. ౧౪౬.

శా. పీనాపీన, సమాంసమీన, సుకరన్, విఖ్యాతవిత్సాదరన్
గోనాగాంచితగోసమూహ్య, సుఖసందోహ్యన్ సువస్త్రా
హీనా స్థానంబందు నలంకరించి కపిలం దానంబు గావించు వాఁ
డానాకంబుననుండు నెన్ని నెలలో నప్పడ్డ కన్నేడులున్. ౧౪౭.

చ. గరితరో, మున్ను బ్రహ్మపునుకన్విడనాడఁగ దేశదేశముల్
దిరుగుచు నెందును న్గెడపలేక లసంగముననందుమున్గినా
కరముననున్న పున్క డగి కాశ్యపిప్రైఁబడె దాని చిహ్న మీ
వరకును జూడనొప్పు నఁట పట్టునముట్టిన మోక్షమిచ్చుచున్. ౧౪౮.

వ. నా నివసించుటంజేసి రుద్రతీర్థంబు నాఁబడునది యష్టదళపద్మంబువలెఁ జూపట్టునఁట నశ్వత్థంబు కర్ణికయయ్యె. తూర్పున సోమగిరియు, నాగ్నేయంబున నర్కపర్వతంబును, దక్షిణంబున దేవేశపర్వతంబును, నైఋతికడఁ గనకాచలంబును, బడమర మహాబలాచలంబును, వాయవ్యంబున బిందుకాచలంబును, ఉదీచియందు శ్రీగిరియు, నీశాన్యంబునఁ గుండశైలంబును దళంబులయ్యె. ఆ పర్వతంబులయందు మల్లికార్జున మహాబలేశ్వరాగస్త్యేశ్వరాది దివ్యలింగంబులు దేదీప్యమానంబులై దర్శనమాత్రంబున నఖిలేష్టార్థంబు లొసంగుచుండు. ౧౪౯.

చ. అవనిజలార్ణవంబయిన యప్పుడు త త్త్రిమకూటమందుఁ బెం
పవు వటమందు నాకుపయి నాహరి, రావిసుకోటరంబునన్
శివుఁడును దమ్మిచేకులయి చెన్నలరారెడు పర్వతంబులం
దవిలి మునీంద్రులు న్నిలిచితారు మెలంగెద రెంతయేనియున్. ౧౫౦.

వ. సకలదేవతలు నటకుంజని యున్నంత మీనమాసమం దుత్తరఫల్గునీనక్షత్రంబున నక్ష
త్రేశ్వర కిరీటుండు పంచలింగంబులంగలసె. హైమవతియుఁ జాముండింగలసె. డుంఠి
వినాయక నందికేశ్వరకుమారాదు లాయారూపంబులం గలసియుండిరి. కాశీగయా
ప్రయాగాదులంగల తీర్థంబులెల్ల నటఁ బొలుపొందు నగస్త్యేశ్వరుని సేవించువారికి
మోక్షంబరచేతిదని సనత్కుమారుండు చెప్పిన విని దర్శన లాలసుండగు వ్యాసుండు
సశిష్యుండై బయలువెడలి కావేరికరిగి యా సహ్య సాగరాంతతీర్థంబులెల్ల నాడి కపి
లాసంగమంబునకు వచ్చి లింగపంచకంబు సేవించి దశంబుల నీశ్వరులంగొలిచి రుద్ర
తీర్థంబాడి యశ్వత్థమూలంబునఁ బితృశ్రాద్ధంబుగావించి యగస్త్యేశ్వరు నర్చించి పాపా
పహరంబునకై నిలిపిన ధ్వజంబుదర్శించి యచటఁ గొంతకాలంబు నివసించియుండె
నింక నయ్యగస్త్యేశ్వరాది లింగపంచక ప్రతిష్ఠాక్రమం బెట్టిదనిన. ౧౫౧.

## అగస్త్యేశ్వర హనుమదీశ్వరుల వృత్తాంతము.

ఉ. మున్నొకనాఁ డగస్త్యముని ముఖ్యుఁడు శిష్యులతో నెలంతతో
మిన్నులు ముట్టువింధ్యము నిమిత్తమున న్మలయాద్రికేగు వాఁ
డన్నది సంగమంబునకు నాగతుఁడై జలమాడి సత్క్రియల్
గ్రన్ననఁదీర్చి తమ్మివలెఁ గ్రాలెడు క్షేత్రముఁ జూచిమెచ్చుచున్. ౧౫౨.

వ. నివసించియున్న యవసరంబున నాదృచ్ఛికంబుగా వాయునందనుం డెదుర నావిర్భవిం
చినం గని కృతనమస్కృతుండై మన్నించి మునియిట్లనియె. ౧౫౩.

తే. అంజనీప్రియనందన, యాడఁబోయి
నట్టి తీర్థము దానెదురైన యట్లు
వెదుకఁబోయినతీఁగ కాళ్లఁదగిలినట్లు
లంతరములోనఁ దలపోయు నంతలోన
నెదుట సాక్షాత్కరించితి విపుడునీవు. ౧౫౪.

తే. ఎట్టికార్యములైన నీవింతలోనఁ, జేయఁజాలెదవని వేరచెప్ప నేల
ద్రోణగిరిదెచ్చి లక్ష్మణు ప్రాణమిచ్చి, నెగడు గైకొన్న నీకిలనీవసాటి. ౧౫౫.

క. తగనిపని నాకఁ బెఱుకాఁ, ల్వగతి నవ్వడి దాఁటి కడలి లంకం జను నా
జగతి సుతఁ దెలిసి రాముల, వగఁ బుడిపినయట్టి నిన్ను వర్ణింపనగున్. ౧౫౬

వ. అని యనేకవిధంబుల నభివర్ణించి పొగడుచు. ౧౫౭

మ. వినుమీ నాదుమనోరథం బిపుడు నే విశ్వేశ్వరు న్నిల్పెదన్
మును వాక్రుచ్చె విధాత యిట్టులగుటన్ ముఖ్యంబు కర్తవ్య మీ
వనుకంపం జని కాశికాపురికి గంగాంభోంతరం బందునుం
డిన లింగంబును గొంచు రమ్ము కడు వర్ణింపంగ నీ వేగమున్. ౧౫౮

వ. అనుటయు నతండట్టి కాకమునీ వారణాసికరిగి శివలింగాన్వేషణంబు సేయుచున్నంత
నించుక విలంబంబయ్యె నంతలో నగస్త్యుండును. ౧౫౯

తే. సైకతంబున లింగంబు సంతరించి, శైవశాస్త్రోక్త మార్గంబుఁ దీవి మెరయ
నొగిఁ బ్రతిష్ఠించి మఱి షోడశోపచార, ములను బూజించి యిట్లని పొగడె భక్తి. ౧౬౦

సీ. ధ్యానంబు వాఙ్మానసా గోచరునకు నావాహనంబు త్రిజగద్వ్యాపకునకు
నాసనం బమల కైలాసవాసునకు సుపాద్యం బఖిలతీర్థ పాదునకును
అర్ఘ్యంబనంత రత్నాకరేషుధి కభిషేకంబు స్వర్ణదీశీర్షునకును
ఆచయమనీయం బనంత రూపునకు దివ్యాంబరద్వయము దిగంబరునకు
నవశయజ్ఞోపవీతగంధ సుమధూప, దీపనైవేద్య తాంబూల దిక్ప్రదక్షి
ణములు సర్వేశ్వరునకంచుఁ గ్రమముతోడ, వేడ్కఁ బూజించి యిట్లని విన్నవించె.

కల్పవల్లీవృత్తము.

జయసోమనమో జయరుద్రనమో జయజయ పశుపతినామనమో
జయతామ్రనమో జయశంగనమో జయజయ ఖలసమిదుగ్రనమో
జయభీమనమో జయశర్వనమో జయజయ శివతరశీలనమో
జయదేవనమో జయభర్గనమో జయజయ మునివరపాలనమః. ౧౬౨

భుజంగప్రయాతము. నిరస్తోద్భవాస్తా, మునిస్వామ్యపాస్తా
స్థిరాంచత్సమస్తా, నదీగ్రస్తమస్తా
అరిత్రస్తభక్తావసాస్థా ప్రశస్తా
నురన్నాథశస్తా, నమస్తే నమస్తే. ౧౬౩

తే. శంకరాయ సుభక్తవశంకరాయ, సంకరాయతదుష్టనాశంకరాయ
కింకరాయితకృష్ణాదిశంకరాయ, భద్రమస్తు దయాస్తు తుభ్యం నమోస్తు. ౧౬౪

క. సర్వమయు సర్వపూజ్యుని, సర్వేశ్వరు నిన్నుఁ బూలుజలమిడి కనుటల్
శర్వా, నీయది నీకుం, జర్విత చర్వణము సువ్వె! చర్చింపంగన్. ౧౬౫.
చ. అని కొనియాడి యశ్రుముఖుఁడై మునిముఖ్యుఁడు దండదండమో
యనఁబడి సాఁగి మ్రొక్కునపుడా వరలింగమునందు దేవితోఁ
గనఁబడి లెమ్ము వత్స, యిటఁ గౌతుకమారవసింతు నెప్పుడున్
జనులకు మోక్షమిత్తునని శంకరుఁ డమ్మునిఁదేల్చె నంతటన్. ౧౬౬.
క. గిరిరాజసుతయు నాతని, శిరమునఁ గరమూపి తపము సిద్ధించె నిటం
దిరమై నిలిచెదనని య, ద్దరిఁ గండికరూపమంది తగవసియించెన్. ౧౬౭.
ఉ. అంతట వాయునందనుఁడు నాడకు లింగముఁ గొంచువచ్చి కుం
భాంతరజప్రతిష్ఠితము నిర్చితమైతగు లింగమెన్నిలో
నెంతయుఁ గిన్కనూఁకొని మునీశ్వరు నెంతటికైనఁ జాలు వా
రింతటి మాత్రలోన నిటు లీతఁడొనర్చె నిఁకేమి సేయుదున్. ౧౬౮.
తే. కాశిపురికేగి లింగంబు గడఁకఁ దెచ్చి, నట్టి యాయాసమంతయు నిట్టిరొదల
వమ్ము గాకుండ మానిలింగమ్ము వెతికి, నేను దెచ్చిన లింగంబు నిలుపువాఁడ. ౧౬౯.
చ. అని కృతనిశ్చయుండగుచు నప్పవమానసుతుండు చుట్టునున్
ఘనతరవాలముం దిరుగఁగా నొనరించి బలంబు పెంపునన్
మునికృతలింగమున్ బెలుకఁ బూనికడంగుడు ముజ్జగంబులుం
గనుకని గంపముం గొనియెఁగాని చలింపదు లింగమింతయున్. ౧౭౦.
ఆ. లింగమూడిరామి నంగంబు నొచ్చుట, పరులకడను నవ్వుబాటుకతనఁ
బోడిగఁ జేయుదునని కడఁగి తామ్రమాత్రుఁడై, ముష్టినడచె లింగమూర్ధమందు. ౧౭౧.
వ. అట్లడంచియు విఫలమనోరథుండై మూర్ఛంబడి నేలఁబడియె నిప్పటికి నా లింగ
మూలాగ్రంబుల నాంజనేయకరవాలలాంఛనంబులు జూపట్టు ననంతరంబ. ౧౭౨.
చ. మునియుఁ దపఃక్రియాచరణ మున్విడిమూసిన కన్నువిచ్చి క
న్గొని సువిసంజ్ఞుఁడై ధరణిఁగూలిన గాలికుమారు గాదిలిన్
మొనసి కరాంబుజంబునను ముట్టినమాత్రన లబ్ధసంజ్ఞుఁడై
కనసతఁడొప్పి మానిపదకంజములంబడి మ్రొక్కెఁ గ్రక్కునన్. ౧౭౩.
వ. సాష్టాంగదండప్రణామంబు గావించి యిట్లని విన్నవించె. ౧౭౪
మ. అపరాధం బొనరించినాఁడ మునివర్యా, జాతిధర్మంబునన్
గృపసైరించి త్వదీయకింకరుని నన్నేలందగుం బాలిశుం

కృపణుం బాలుని బాలభావుననుచుం గించిజ్ఞుడుంబోలెనై
కపివర్యుం డతిగద్గదస్వరమునన్ గాటంబు ప్రార్థించుడున్. ౧౭౫.

చ. యతియుఁ గృపాతరంగిత హృదంబుజుఁడై యను లెమ్ములెమ్ము స
న్నుతమతి, నీదుమీభయము దోఁపడు నీకుశుభంబులిచ్చెదన్
క్షితిగను లింగమున్నిలుపు నీవరనామముతోడ మత్పరం
బతిఫలదంబు ప్రాక్ప్రణుతమైతగు నియ్యది భక్తకోటికిన్. ౧౭౬.

వ. తొలుత హనుమదీశ్వరుని సేవింపక కుంభజేశ్వరుని సేవించువారికి ఫలంబు లభింప కుండునని కారణవేత్తయగు మునిసత్తముండు వరంబొసంగిన నతండు నాచెప్పిన చొప్పునఁ గుంభజేశునకుత్తరంబుగాఁ జాముండికి దక్షిణంబున లింగప్రతిష్ఠగావించి కృతకృత్యుండై యుత్తరదేశం బరిగె. అగస్త్యుండును మలయాచలంబునకుఁ గృతగమనుండై నిత్యనివాసంబుండె. ఇదికుంభజేశ్వర హనుమదీశ్వరుల వృత్తాంత మింక సోమనాథేశ్వర మహాత్మ్యంబు వినుము. ౧౭౭.

## సోమేశ్వరవృత్తాంతము.

తే. మున్ను జంద్రుఁడు దక్షుని పుత్త్రికలను, సర్వలక్షణ లక్షితచారుతనుల
నిరువదేడ్వురఁ గోమ్ములనింపుమిగులఁ, బెండ్లియాడెను గుహ్యాక్ష విధిదలిర్ప. ౧౭౮.

వ. పెండ్లియాడి వారియెల్లర నొల్లక కామాత్ముండగు నతండు రోహిణీసక్తమానసుండై యుండె. తదుత్కృష్టాసహిష్ణులగు తక్కనుంగల చక్కచెలులప్పతిని విడనాడి పితృసమీపంబున కరిగి రచుండును. ౧౭౯.

ఉ. కళలకుఁ బెన్నిధానమయి కాలెడు చంద్రున కీడు గర్మప
త్నులు తగునాటఁ బుత్త్రికలు నోములునోఁచి యశంబుగొన్నవా
రలతులు నాతి మీరతఁడు సంపకనేఁ బిలుపింప కెట్లు వి
చ్చలవిడి మెట్టుకొంచు నిటుచక్కఁగనవ్వుట పోలియుండునే. ౧౮౦.

క. పిలువక వచ్చుట యడుగక, పలుకుటయు నలంతులైనవారలతోడం
జెలిమిచేయునప్పుట నవ్వుట, చులకన కివికారణములు సుందరులార. ౧౮౧.

తే. స్వేచ్ఛదిరుగుట విధనకుఁ జెల్లుఁగాని
భవతికినిఁజెల్ల దత్యంతపాతకంబు
గాన్షపవ్పల్లమీరతి గర్వితంబు
కార్యమొనరించి నిందకుఁగట్టువడితి
రనుచు పలవించికోపించికనలుచుండె. ౧౮౨.

వ. ఇట్లు కోపించి పలికిన పితృవాక్యంబుల కత్యంత దుఃఖాక్రాంత చిత్తలై తత్తరంపడి దైన్యంబుదోఁప నీరెలుంగున నిట్లనిరి. ౧౮౩.

శా. తండ్రీ, మాకుఁ దటస్థమైన దురవస్థ న్వింటె చంద్రుండు ను
ష్మాంద్రించుచుఁ దయఁజూడ కన్యలగతిన్ హైన్యంబుగాఁ జూచుచున్
గండ్రల్గా శపియించి ధిక్కృతులఁ బోకార్చుంచుఁ దిట్టున్ సదా
గుండ్రా డొందమువాఁడమో కరఁగి మాకున్వేడ్క సేయండుసూ. ౧౮౪.

తే. రోహిణీసక్తచిత్తుఁడై రోసియతఁడు, వెడలగెంటిన నవమానపడి త్వదీయ
సవిధమున కేంచితిమి నీవు సర్వకార్య, దక్షుఁడవటంచుఁ దలఁచుచు నీ క్షణమున.

తే. నరునకు ముదిమినడిచిన నడువకున్న, గుజ్జమునకా తపంబాట్ను కోకలకును
స్త్రీకి రతిలేకయుండినఁ జేరు ముదిమి, గాన వేఁడవచ్చినఁ గోపమూననేల. ౧౮౬.

తే. పతిని విడనాడివచ్చుట పాడిగాదు, మరుని దాడిమికోర్వ మాతరముగాదు
తల్లిదండ్రుల కెఱిఁగింపఁ దగదటన్న, నేమిసేయుదు మెటఁబోత్తు మేదిదిక్కు. ౧౮౭.

తే. గోచుమట్టుపై రోకలి జేరినట్లు, మూలిగెడు నక్కమీఁదను దాళిఫలము
పడినయట్లిటుఁ గడుపాట్లు పడిపడి నిను, జేర నీవిట్లు దూరితి చిత్తగింపు ౧౮౮.

వ. అనుచు నేడ్చుచు నతనియడుగులంబడిన నతండు కొమరితలఁ గరుణించి క్రోధతామ్రాక్షుండై దక్షుండాక్షణంబ కలాహీనుండగుఁ గావుతమని రోహిణీకాంతుని శపించిన నతండు నీత్రిమకూటంబున కరుదెంచి రుద్రసరోవరంబున జలంబాడి శంకరుం బ్రార్థించిన నద్దేవుండు లింగరూపంబునం బొడసూపి పూజితుండై శాపంబుడిగించి కళలొసంగె. అదిమొదలాలింగంబు సోమేశ్వరాహ్వయంబునం బొలుపొందు. మార్కండేయుండు పూజించిన లింగంబు మార్కండేయేశ్వరాఖ్యదీపించు నిఁక గర్గేశ్వరుని కథ యెట్టిదనిన. ౧౮౯.

## గర్గేశ్వరచరిత్రము.

సీ. కలఁడు గర్గుండనఁ జెలఁగెడు ముని యదుకులగురుండొక్కఁడు గుతేలమందు
నతఁడవమానితుఁడై వారిమడియింపఁగలవాని నొక్కనిఁగనఁగఁగోరి
వలిమలనూరేండ్లు నిలిచి నిరాహారియై హరుఁగని వరమర్థి బొంది
మఱలినిజోటజ మఱుగుచోనపత్యుఁడును సభాగ్యుండుయావనుఁడువచ్చి
పుత్త్రిదానంబుసేయు మిష్టాలఁతియుంను, ననుచుఁ బ్రార్థింప నతఁడా మెనంటె నంతఁ
గాలయవనుండు జన్మించెఁ గాలునట్టు, లా సుతునొసంగి యవనుని నంపిపుచ్చి.

వ. గస్తుండును వ్యాకులమనస్కుండై త్రిమకూటంబునకేగి పెక్కేండ్లు తపంబొనరింప మాఘ కృష్ణచతుర్దశీదినంబున నంబికేశ్వరుండు ప్రత్యక్షంబై గర్గేశ్వరాభిధానంబునంబొంది వెలుఁగొందుచుండె. ౧౯౧.

క. పరదారగామి పరధన, హరుఁడును బరవంచకుండునగు వాఁడయ్యీ
శ్వరుఁ గొల్చినఁ బాపపరం, పరలం దెగఁగోయు లతలఁ బరశువు వోలెన్. ౧౯౨.

వ. మఱియుం గాలనాథుండు దండపాణియై కుంభజేశ్వరోదగ్భాగంబున క్షేత్రపాలకుండై నిలిచె. వ్యాసేశ్వరుండు నారుద్రసరస్తీరంబునం బాలుపొందు నచట వటపిప్పలంబులు రెండుత్పన్నంబయ్యె. తత్సమీపంబున గదాధరుండు లక్ష్మీనృసింహుండై స్వయంవ్యక్తంబయ్యె. అతని యెదుట దక్షిణామూర్తి మూలస్థానేశ్వరుం డను పేరం బరఁగు. జ్యేష్ఠేశ్వర మహాకాళేశ్వరు లర్యమేశ్వరత్వంబు నొందిరి. అందు గ్రీష్మదినంబులఁ జలువలూరు ప్రేతశిలయొకఁడు కలదు. దానిపై నేఁటికిని ముని వికీర్ణితంబులు తిలలు చూపట్టు. ఆ చెంత వశిష్ఠేశ్వరుండుండు నట వశిష్ఠుండు సత్రయాగంబు గావించె. యాగభస్మరాసులిప్పుడును లోచనగోచరంబులగుఁ గాశియందుఁ గల దేవతలెల్ల నటఁ బాషాణ తరుగుల్మాదిరూపంబులంబొంది నివసించిరి. మణికర్ణిక రుద్రతీర్థంబయ్యె. జ్ఞానవాపి సోమతీర్థంబు నాఁబడు. వైష్ణవతీర్థంబులెల్ల నరసింహతీర్థంబునంబొందె. ఆ గుంజానృసింహు వామభాగంబున నర్యమేశ్వరునకు సమీపంబున జ్ఞానతీర్థంబును హనుమదీశ్వరుని పశ్చాద్భాగంబున నక్షిక్షేపతటాకంబునుం గలదు. మార్కండేయేశపశ్చిమంబున దశాశ్వమేధ తీర్థంబు వహ్నితీర్థంబు నాఁదనరు. సకల నదులును తీర్థంబులును క్షేత్రంబులును గావేరీకపిలాసంగమ మధ్యత్రిమకూటంబునం బాపాపహంబులై పరివర్తించు ననంతరంబ. ౧౯౩.

## గజారణ్యమహాత్మ్యము.

తే. అలరు సోమార్కశైల మధ్యంబునందు, నఘహరంబుగజారణ్యమందు వైద్య
నాథుఁ డను పేర శివుఁడుండు సాధుజనుల, కగు భవామయ ముడిగింపఁ జనుదినంబు.

క. వరమగు నక్కరి వనమున, నరుదుగ గోకర్ణతీర్థ మననొక్క సరో
వరమది కోకనదంబులఁ, బరిపూర్తిం జెంది కనుల పండువసేయున్. ౧౯౫.

చ. కనఘన మయ్యరణ్యమునఁ గ్రాలెడు నేనుఁగుతుండు నొండొగిం
దినఁ జను కయ్యెత్తి తామరయుఁ దెఱచిన నీరొకకుండ డెందుఁ జవం
బునఁ గొనిపోయి యొక్క బోదెఁబోసి నమస్కృతి జేసి పోఁగనుం
గొని యిటఁ జోద్య మేమగునొకో యని యద్దఱు లుబ్ధకాధముల్. ౧౯౬.

వ. పోయి పరీక్షించి యొద్దియుం గానక పరశ్వధంబుల నక్కుంజంబుఁ దెగ నఱకం జొచ్చి యమ్మధ్యంబున నున్నయున్నత శునకశాల్మలిం జూచి గొడ్డలియెత్తి వైచునంత నది యట నొకశిలాతలంబుపైఁబడి పగిలించె నటనుండి కీలాలంబు స్రవించి తత్క్షణంబ క్షీరంబయ్యె. అది గనుంగొని వెరంగుపడి మృగవ్యాధులా పాలసంటి కృత్తోత్తమాంగం బగు కృత్తివాసోలింగంబుగని నమస్కరించి యపరాధంబు సైఁపుమని ప్రార్థించు నంతలోన. ౧౯౮.

ఆ. మృగయులార, మీర లీ పాలు ద్రావిన, చోగణాధినాథులై గణింపఁ
బడి వసింతు రిచట భద్రాయితాంగులై, యనుచుఁ జదలపలుకు లరయుచయ్యె. ౧౯౯.

వ. వారును రుద్రాదేశంబున శాల్మలీఫలపిష్టంబా లింగవ్రణంబున మెత్తి క్షీరపానంబు గావించి గణేశ్వరులైరి. ఇప్పటికిని శిలామయ లుబ్ధకవిగ్రహంబులు గానంబడు గజేంద్రుండు చెప్పటియట్లు వచ్చి శివునర్చించి ప్రాలుద్రావి కైలాసంబున కేగె. శంకరుండు తనవ్రణంబునకుఁ దానవైద్యుం డగుటంజేసి వైద్యనాథుండు నాఁబరఁగె. అక్షిరోగ శిరోరోగ జ్వరాపస్మార గుల్మశ్వాసకాస విషోన్మాద గ్రంథిశూలభగంధర వాత పిత్త శ్లేష్మజాది రోగంబులెల్ల నచటి మృత్తికాసంపర్కంబునం జేసి వినాశనంబందు. పరమపవిత్రంబగు గోకర్ణతీర్థంబు పొంతఁ బ్రాగ్భాగంబున నర్కనాథుండును దక్షిణంబునఁ బాతాళేశ్వరుండును పశ్చిమంబున సికతానాథుండు నుత్తరంబున మల్లికార్జునుండును ఆ మధ్యంబున వైద్యనాథేశ్వరుండు దేదీప్యమానంబగు. ఆ పంచలింగదర్శనంబు మహాపాతకోప పాతకహరంబు. అచటఁ బశ్చాద్భాగంబునఁ బశ్చిమవాహినియై కావేరి పొలుపొందు నచటి స్నానదానాదు లత్యంత ఫలప్రదంబులని వెండియును.

మ. పరఁగు న్మన్ను దిలీపభూపవరుఁ డిక్ష్వాకున్వవాయోద్భవుం
డురుసారుండతఁ డర్ణవావృత సమస్తోర్వీతలం బేలుచున్
సరిలేకున్నెడ నొక్కకాలమునఁ దద్జ్ఞాతు ల్మహాపాతకుల్
పురమున్ సర్వధనంబుతో నొడిచి వేఁ బోదోలిరా భూపతిన్. ౨౦౦.

తే. అనలకల్పు లాజ్ఞాతు లాతనిసుపత్ని, కొసఁగిరంత నంతర్వత్ని కుగ్రవిషము
"శత్రుశేషం న శేషయే దత్ర" యనుచు, నెంచుకొని యేమి లేకున్న నిట్లు తగునె.

వ. దురదృష్టదుఃఖితుండగు దిలీపుండును విషంబునఁ గాలధర్మంబునొందని యిల్లాలి వెంటఁ బెట్టుకొని పాదచారియై కతిపయప్రయాణంబుల నా పశ్చిమవాహిని కేతెంచి

ముండు రెండు నాళులుండి దేహపరిత్యాగంబు చేసి తత్ప్రభావంబున స్వర్గంబునకు నిర్గ
మించె నంత నతని కాంతయును. ౨౦౨.

చ. అరుదుగ నెల్లవేళల దయామతిఁ గంటికి ఱెప్పవోలెఁ ద
న్నరసి సుఖింపఁజేయు విభుఁడట్టయి పోవుట కంతయేనియుం
దురపిలి శుష్కకాష్ఠములతోఁ జితసేసి గమింప నెంచె నా
గరితల కట్టిచందమగుఁ గాదె నరిత్రిఁ దలంచి చూచినన్. ౨౦౩.

వ. ఆ సమయంబున. ౨౦౪.

చ. చదలిటులాడె సాహసము సల్పకుమమ్మరొ, నీదు బొజ్జలోఁ
బొదలెడు సర్వశాత్రవులఁ బొల్పరఁ జేయు ననల్పశక్తితో
మెదలెడువాఁడు సర్వమగు మేదిని నేలఁగలాఁడు నందనుం
డిది తగదన్న మాని హృదయేశు నిడెన్ జ్వలనార్పణంబుగన్. ౨౦౫.

వ. తాను నా కావేరీస్నానంబును మల్లికార్జున లింగార్చనంబునుం జేయుచు నాకలం
బుల దుంపతూండ్ల దేహయాత్ర నడుపుకొనుచున్న సమయమందొక్క శుభలగ్నంబున
ద్వాత్రింశల్లక్షణోపేతుండును శత్రుదత్తగరాన్వితుండు నగు కుమారుండు పుట్టి మా
తృపోషణంబునం జేసి శుక్లపక్ష క్షపాకరుని చందంబున దినదినప్రవర్ధమానుండై సగ
రుం డనంబరఁగి హరునారాధించి తత్ప్రసాదంబున శత్రుసంహారంబు గావించి సర్వ
సర్వంసహా రాజ్యంబుఁగొని పాలింపుచుం జక్రవర్తియై షష్టిసహస్ర సంఖ్యాక పుత్త్రు
లం బడసి సుఖంబుండెనని వెండియు. ౨౦౬.

సీ. సోమదత్తుండను భూమీసురుఁడు పూర్వ మంబికేశానుగ్రహంబు వడసి
జన్మకోటి సహస్ర సంభ్రాంతునకు నెప్డుఁ జెడనిపదంబేడఁ జెందఁగలుగు
ననిన శంకరుఁడను నల్లకావేరియుఁ గపిలయుఁ గలసినఁ గడఁగుచోటి
కర్ధయోజనమున నలరు సిద్ధాశ్రమ మొకఁడు సర్వశ్రుతి ప్రకటితంబు
అటకు శిష్యసమేతుఁడై యరుఁగు ముక్తి, కరతలామలకంబుగాఁ గలదు నీకు
నని తిరోధాన మొందిన నతఁడు నటకు, నరిగి ఘనుఁడయ్యెఁ దదనుగ్రహంబువలన.

వ. మునీంద్రులెల్లరు గజరూపధరులై యచట నివసించి లింగంబులఁ బ్రతిష్ఠించిరి కాన నది
గజారణ్యంబు నాఁబడె నచట ద్వాత్రింశత్కోటి దేవతాసహితుండై దేవేంద్రుండును
మనుష్యధర్ముండును లింగంబులం బ్రతిష్ఠించి యభీష్టంబులు వడసిరి. అర్కప్రతిష్ఠితుం

డగుటను మ్హానాథుండు అర్కనాథుండనియు వాసుకి ప్రతిష్ఠితంబగుట శివుండు వాసు
కీశ్వరుండనియుఁ బరఁగుదురు. అటఁ గావేరి యుత్తరవాహినియై యొప్పునని మఱి
యును. ౨౦౮.

చ. జగముల సృష్టిఁజేయుమను స్రష్టసరస్వతి సృష్టిఁజేసి య
మ్మగువనుఁ జూచి మోహపడి మానినిబారికిఁ జిక్కి కౌగిలిం
పఁగఁ జనఁ దండ్రిఁగూడ నగు బాటగునంచు భయంబు పెంపునన్
వగచుచు నామె లేడియయి పాఱె హరోంహర యంచు నార్చుచున్. ౨౦౯.

వ. అప్పు డప్పితామహుండును. ౨౧౦.

మ. వెను వెంటంబడి యిత్త్రియైపఱచి దేవీసన్నికృష్టంపు భూ
మిని ముట్టం జనువాని కట్టెదుటికిన్ మృత్యుంజయుండుగ్రమె
ల్లను మూర్తీభవమయ్యెనో యనఁగ భిల్లవ్యాఘ్రమై స్కర్శర
క్షను గావింపఁగ వచ్చి హుమ్మనుచు నిష్ఠ్వాసంబు సారింపుచున్. ౨౧౧.

మ. ధరణిం గాలూకఁదూది సాఁచి శరసంధానంబు గావించి వి
ల్లరలేకుండఁగఁ జేది యోరి, యిది యేరా! కాని మర్యాదకుం
జోరరాదన్న వివేకమేది యిటుచేఁ జూడంగ నేర్తెత్తురీ
వరయంగా నీకన్నైన మానఁదగుఁ గాదన్న న్ననుం జూడరా. ౨౧౨.

వ. అని రుద్రుం డతిరౌద్రంబునం బలికి వానిశిరంబుఁ దెగనటికిన నది యిప్పటికిని నక్షత్ర
మండలంబునం జూపట్టు. నలువయు సిగ్గుపడి దుష్టనిగ్రహశాలియగు శూలిచేఁ దిర
స్కృతుండై గజారణ్యంబునకు వచ్చి సైకతంబున నొక్కలింగంబు సంతరించి పూజించి
ప్రార్థించిన శివుం డతని యభిప్రాయం బెఱింగి శారదశబ్ద బ్రహ్మమయంబు గావించి
యతనికొసంగె. ఆ సైకతలింగం బిపుడు గురుతల్పగమనాది దోషంబులఁ దొలంగించు
చుండు. ౨౧౩.

సీ. వరకార్తికిక శుద్ధపక్ష చతుర్దశి మల్లికార్జున పూజ మహిమ లెంచు
శ్రావణ శుక్లపక్ష తృతీయ చాముండిఁ గొలిచి వైధవ్యంబుఁ గొనరు చెలులు
ఆశ్వీన శుక్లపక్షాగత నవమీ దినంబు తత్సేవ కామ్యంబు లిచ్చు
వైశాఖ పూర్ణిమ వైద్యనాథునిఁ గొల్చి శివలోక మందెద రవనిజనులు
మాఘశుక్ల సప్తమి దినమందు నర్కనాథు నర్చింప మోక్షంబు నొసులకబ్బు
శ్రావణంబున శుద్ధపక్షంబునందు వాసుకీశ్వరుఁ గొలిచిన ఫలము ఘనము. ౨౧౪.

వ. మాఘకృష్ణచతుర్దశి సైకతేశ్వరుండును, గార్తికబహుళపక్షాష్టమిమల్లికార్జునుండును, దర్శనమాత్రంబున సాయుజ్యమిత్తురు. గోకర్ణ సరస్స్నానంబును, చండికాపూజయు, వైద్యనాథాది లింగపంచక సమర్చనంబును గావించునది. కాశీక్షేత్రంబుకంటె శతగుణాధికంబగు నాక్షేత్రమాహాత్మ్య శ్రవణంబును మహాపాతకోప పాతక హరంబు. ఇది గజారణ్య వృత్తాంతంబు. దీనికిఁ బురోభాగంబున యోజనద్వయదూరంబున హేమకూటంబు గలదు. అచటఁ గుండినేశ్వరుండు భీముండు తనపేర శివలింగంబు నిలిపి పూజించి నలాన్వేషణంబు గావించె. నలుండు నద్దేవుంగొలిచి నిజరాజ్యపదంబునొందె. కర్కోటకుండు నటఁ దపించి శాకల్యశాపవిముక్తింగనె. ఋతుపర్ణుండు నా భీమేశ్వర ప్రసాదంబునఁ గలిదోషంబులం బెడబాసె. అవ్వల శ్రీరంగనాథాస్థానంబును భుక్తిముక్తిప్రదంబునగు చంద్రపుష్కరిణీక్షేత్రంబు గలదు; అనిచెప్పుటయు.

## ఆశ్వాసాంతము.

మ. రమణాంబావరసత్కవిస్తుతికమతిప్రాంచద్గుణస్ఫూర్తిము
త్తమతేజఃకలితంబన ఘ్నముజగత్పారిజాతేశ్వరామాత్యరా
జమహేంద్రాభరణాయమానమలకృష్ణస్వాతిమేఘోద్భవం
బమలాంతస్థముసుబ్బరాయబిరుదాఖ్యాతంబువర్ధిల్లుతన్. ౨౧౬.

మాలిని. సకలరిపువిహారీ, సర్వలోకోపకారీ
ప్రకటితగుణహారీ, భవ్యమార్గానుసారీ
సుకృతిచయవిహారీ, శోధితాజ్ఞానరారీ
వికృతరహితసూరీ, వేదశాఖాప్రచారీ. ౨౧౭.

గద్యము. ఇది శ్రీమదనునాథసోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్త్రి. సమారాధిత విబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజప్రణీతంబైన కావేరీచరిత్రంబనుమహాపురాణంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ

# కావేరీచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీపసలపూడి నగరము, కాపురముగ నుండి సుకవికల్పక మగుచున్
దీపించుసుబ్బరాయుని, గాపాడుము కరుణతో సకలజగదీశా. ౧.

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కీశ్వరుం డీశ్వరికిం జెప్పినచొప్పునం జెప్పువాఁడై యిట్లనియె. ౨.

శా. శ్రీరంగంబనఁ జంద్రపుష్కరిణినా క్షేత్రంబు దీర్ఘంబు కా
వేరీమధ్యమున న్మహోత్సవముల న్విఖ్యాతమై ముక్తిదం
బైరంగేశ్వరవాసమై సకలదేవారాధ్యమై భుక్తిదం
బై రంజిల్లు నిల న్వికుంఠవిలయం బంచుం బ్రశంసింపఁగన్. ౩.

చ. సలిలజకుట్మలంబువలె సొరగుదివ్యవిమానమధ్యమం
దలఫణిరాజతల్పమున నచ్యుతుఁ డచ్చట యోగనిద్రమై
నలరెడుఁ దన్మహత్త్వముమహామును లీశ్వరు లంతవారు నేఁ
దెలుపఁగ లేరు నేఁ దెలుపఁ దెంపువహించితి నన్ను సవ్వరే. ౪.

వ. అయన నాకుం దోఁచినట్లిందుక విన్నవించెద సావధానచిత్తులరై యాకర్ణింపుడు. ౫.

## శ్రీరంగక్షేత్రమాహాత్మ్యము.

చ. పరమపతివ్రతామణి, కృపాపరిపూరణి, దక్షపుత్త్రి, ని
ర్జరజననయిత్త్రి, కశ్యపునిసాని, మహత్త్వమున న్భవాని, భా
స్వరమతిఁ బొల్చునయ్యదితి వైరులఁగూల్పఁగ విష్ణువంతవా
టరి యగు పుత్త్రినిం బడయ స్వాంతమునం దలపోసి యంతటన్. ౬.

వ. తనమనోరథంబు మగని కెఱింగించి ప్రార్థించుటయును నతండును.

మ. తరుణీ, నీదుమనోరథంబు సఫలత్వం బొందఁ జేయంగ శ్రీ
హరికిం దక్కఁగఁ దక్కవారికి నసాధ్యం బందునం జంద్ర పు

ష్కరిణీతీరమునందు సన్మునులు మెచ్చంజాలునిష్ఠం దప
శ్చరణంబున్నడిపింతువే నతఁడు సాక్షాత్కారముం బొందెడున్. ౮.

వ. నీకార్యసిద్ధి యగుం బొమ్మనిన నయ్యమ్మ సమ్మునమ్మున సంతసమ్ము నొంది తదనుమత
మ్మునఁ జంద్రపుష్కరిణికడకుం జని నిష్ఠాగరిష్ఠయై నిరశనవ్రతంబునఁ దపం బొనరించు
చుండె. అంతఁ గొంతకాలంబునకు రమాకాంతుండు లోచనగోచరుండై ‹‹ నీతపం
బునకు మెచ్చు వచ్చి వరం బిచ్చెద వేఁడుకో›› మ్మనిన నచ్చకోరాక్షి యక్షీణ భక్తితా
త్పర్యంబునం బ్రత్యక్షంబైనవాని రక్షించుమని ప్రార్థించి వినుతించుచు నిట్లనియె. ౯.

శా. దేవా, నన్గరుణింపఁగా ఘనమునం దెల్లంబుగా నెంచితే
నీవే నీవలె దైత్యులం గెలిచి నీ వెన్నంగ శౌర్యంబునన్
ఠీవిం జెన్నగువానిఁ బుత్త్రు నొకని న్వీక్షించి మాకన్న రా
జీవాక్షుండు కృపార్ద్రచిత్తుఁడగుచుం జెల్వారఁగా నిట్లనున్ ౧౦.

మత్తకోకిల. ఓమనస్విని, నేను గాక సురౌఘముం బొదలింప నొం
డేమహాత్ముఁడు జాలఁ డందున నేన నీకు నపత్యమై
నీ మనోరథ మెల్లఁ దీర్చెద నెమ్మి నుందు నిటన్ సదా
కామితార్థము లిత్తు భక్తజగజ్జనాళికి నెమ్మియై. ౧౧.

వ. అని పలికి జగన్నాథుం డంతర్ధానంబు నొందె. నదితియుం గశ్యపునిచెంతకుం జని
తన తపంబునకు మెచ్చి జనార్దనుండు వచ్చుటయు వరంబిచ్చుటయు నెఱుఁగం జెప్పి
ముప్పిరిగొను కౌతుకంబున నొప్పించి యప్పురుషోత్తముం గలసిమెలసి మెలంగుచుండె
నంతఁ గొంతకాలంబునకు. ౧౨.

క. నెలదప్పెఁ గోర్కెలొప్పెను, బలుకులు నడకలును జాల బడలిక జెప్పెన్
బలువేవి ళ్లోగిఁ గప్పెను, వెలవెలనై మొగము కళల విప్పన్ గప్పెన్. ౧౩.

వ. ఇట్లు గర్భవతియై యదితి నీరుమోసి మాసంబులు నిండ నొక్క శుభవాసరంబున.

చ. కనియెఁ గుమారు, మారసమ క్రమశరీరు, లసద్విహారు, భూ
జనసుతధీరు, మేరుసమసారు, నుదారు, దశావతారు, స
న్మునిసహకారు, వీరు, సురపూజితహారు, గురుప్రకారు, సం
ప్రణుతమహాధికారు, సుకుమారు, కుమారు, కుమారమారునిన్. ౧౪.

ఆ. అంతఁ గశ్యపాఖ్యుఁ డంతరంగమునందుఁ, బ్రీతి భయము భక్తి పెనగొనంగ
నాత్మజాతుఁ డగుచు నావిర్భవించిన, దేవదేవు నతనిఁ దెలియ వినుచు. ౧౫.

క. సాష్టాంగనమస్కారము, లష్టోత్తరశతసహస్ర మర్పించి మఱిన్
అష్టాక్షరి జపియించుచు, స్పష్టముగా నుతి యొనర్చెఁ బ్రాంజలి యగుచున్. ౧౭.

వ. ఇందిరాసుందరుండు సానందితహృదయారవిందుండై "మీకు నే నందనుండ నైతి" నీ చంద్రపుష్కరిణీతటంబున నుండి కైవల్యంబు నొసంగుదునని యారూపంబు విడిచి మానుషరూపం బంది వామనమూర్తియై బలిచక్రవర్తి ప్రముఖదైత్యుల నిర్జించి నిర్జరలోకం బింద్రున కర్పించి రంగస్థాన మలంకరించె నది యెట్టిదనిన. ౧౮.

సీ. పౌలస్త్యకులజాతుఁడై లంక లోకవిద్రావణుం డొప్పెడు రావణుండు
ఘాతకుఁడగు కుంభకర్ణుండు సత్తముఁడగు విభీషణుఁడు నాయధముతమ్ము
లతఁడు లోకము లెల్లనలజడి వెట్టుడు వేలుపు లెల్లరు విన్నవింప
దామోదరుం డంత దశరథపుత్త్రుఁడై కపిసేనతోఁ గూడి కదలి పోయి
పంక్తికంఠునిఁ దునుమాడి వాహినీశ, మేతుఁడై చను దెంచి సాకేతమునకుఁ
బట్టభద్రుఁడై సామ్రాజ్యబహుళసౌఖ్య, మనుభవింపుచుఁ జుట్టాల నంపువేళ. ౧౯.

వ. వాయుపుత్త్రునకు బ్రహ్మత్వంబు నంగదజాంబవతులకుఁ గాలాంతరంబునఁ దనతోడి యుద్ధంబును, సుగ్రీవాదులకు వారువారు కోరినకోరిక లన్నియు నొసంగి రామచంద్రుం డెల్లర వేఱువేఱ నంపి పుచ్చుచు విభీషణుండనుదినంబునుం బూజాసమయంబుల రంగనాథునిం జూచుచుం దలయూచి మెచ్చుకొనుచుండువాఁడు గావున నతని యభిప్రాయం బెఱింగియు నెఱుంగనివాఁడ పోలె నతనిదిక్కు మొగంబై యిట్లనియె,

శా. తోడంబుట్టిననాఁడు నాక పరశాతోదర్యపస్మారకు
క్రోడీకారనిరస్తచిత్తుఁ డనుచుం గొట్టాడి మీయన్నతోఁ
గూడ న్మన్కి దొలంగఁ బెట్టి ననుఁ గన్గొనవచ్చి చుట్టంబవై
తోడు న్నీడయునై సహాయపడు నీతో సాటి యేమేటియా. ౨౧.

క. ఈయుపకారమునకుఁ బ్రతి, యేయుపకారంబు నీకు నే నిందఱిలోఁ
జేయఁగలవాఁడ నైన, న్నీయిష్టము దెలుపు మింత నెఱవేర్తు నొగిన్. ౨౨.

చ. అనుడు విభీషణుండు వినయంబున దోయిలి మోడ్చి రాఘవా,
నను గడుఁ బెద్దఁ జేసి యిటు నాటఁగఁ బల్కుట న్యాయమా! జగ
జ్జనులను బ్రోవఁ బొల్పెసఁగు శౌరివి ప్రాకృతున ట్లలంతిగా
ననుటలు వింత లింతయిన నన్యులప్రాపుదలంతువే! మఱిన్. ౨౩.

క. నీ కే నప్పు డుపకారము, చేకొనిచేసితి నటంచుఁ జెప్పితి వది నీ
కే కాని నాకుఁ దెలియుదో, లోకమునకుఁ దెలియదోటు లోబొంకనుమన్. ౨౪.

క. భక్తుఁడనగువాఁ డెవ్వఁడు, రక్తిని సామ్రాజ్య మొసఁగి రక్షింపవె ముక్తి
యుక్తిప్రయుక్తు లాడఁగ, భక్తుఁడనే నీదుకెలన సకలాధారా. ౨౫.

వ. నీ యనుగ్రహంబునకుం బాత్రుండనైన నాకుం జేమియుం గొఱఁగాదు. అయిన నిష్ట వరంబు వేఁడుకొనుమంటివి గాన నా చిత్తం బెప్పుడు నీ పాదారవిందంబుల నంటికొని యుండున ట్లనుగ్రహింపు మనిన మందహాసభాసురవదనారవిందుండై రామచంద్రుండు కరదండంబగు బిసాద్రసుం దిప్పించి యంజలిపుటంబునం జూపుచు నిట్లనియె. ౨౬.

మ. ఇతని న్మన్ను చతుర్ముఖుం డెపుడుఁ దా నింటం దగం గొల్చునాఁ
డతఁ డిక్ష్వాకున కిచ్చె మెచ్చి దయతో నానాఁడుగోత్రం గులా
గతమై చెందెను నాకు నీతనికినిం గన్పట్ట దేభేద మీ
పతిమిత్రుండవు గాన నిచ్చెద సుమీ! ప్రార్థింపఁగా నుత్తమా. ౨౭.

క. దేవప్రతిమానుండవు, నీహృదయార్థం బెఱింగి నే నిచ్చెద నీ
శ్రీహరిఁ జేకొని పొమ్మి తఁ, డూహించిన సర్వశుభము లొసఁగెడు నీకున్. ౨౮.

క. అని సజ్జతోడ రంగే, శు నొసంగిన నతఁడు భక్తిశుద్ధాత్ముండై
కొని వీడ్కొని తల నిడుకొని, చనె లంకాభిముఖుఁడై ససైన్యము గాఁగన్. ౨౯.

వ. అట్లు రామచంద్రాను మతంబునం జనువాఁ డమ్మార్గ మధ్యంబున మధ్యాహ్నకాలం బగుటయుం దత్సమయ పూజాతత్పరుండై యచటి చంద్రపుష్కరిణీతటంబున శ్రీరంగధామ దివ్యవిమానంబు నిలిపి షోడశోపచారంబులు విధ్యుక్తక్రియా కలాపంబులు నిర్వర్తించుచుండె నప్పుడు. ౩౦.

ఉ. అంతకు మున్న యోగ్య పురినరక్ష కులార్చితుఁడై దలిర్చు శ్రీ
కాంతునిఁజేర్చి నిల్పుటకుఁ గాంక్ష యొనర్చిన ధర్మవర్మ భూ
కాంతుఁడు చంద్ర పుష్కరిణి గాఢ తపం బొనరించి కేశవున్
సంతస మందఁ జేసికొని సాధువరంబది కొన్ని నాళ్లకున్. ౩౧.

తే. అదితి కిచ్చిన వరము ధర్మాత్ముఁడైన, ధర్మవర్మ కొసంగిన నిర్మలవర
మొక్కగతి గాఁ దలంచుట నొగి సెఱింగి, భక్తపరతంత్రుఁ డచ్చటఁ బాదు కొనియె.

వ. విభీషణుండును గాల్యకృత్యంబులన్నియుం గావించి యెప్పటివలెం గొనిపోవ విమానం బెత్తఁ బూనుటయు నచలంబై యెత్తరాని నుత్తలపాటు జెందుచుం దన చిత్తంబున.

మ. ఇది మా పెద్దలనాఁటనుండియును మాయింటం దిరంబుండు భ
వ్యదమై దివ్యవిమాన మచ్యుతునితో హా! నీకిడంజాల వం

చుదయామూర్తి రఘూద్వహుండిడిఁయె దాసుం ద్రోయఁగా లేక యి
ష్టది యేమొ పెకలింపరాక దిరమయ్యెం బ్రాప్తి లేదేమొకో. ౩౪.

వ. అని మఱియును. ౩౫.

సీ. తరతరంబులనుండి తగికులాను క్రమమునఁ బొంద నున్నట్టి తనకుఁ గాక
నెత్రు పంచుకొని జన్మించి సద్భక్తిమై మెలఁగెడు తనదు తమ్ములకుఁ గాక
పరమోపకారియై పరఁగి ప్రార్థించిన తన కులకర్త పుత్రునకుఁ గాక
తరలిపోయిన యట్టి తమ్ముని ప్రాణమిచ్చిన తన ప్రాణబంధునకుఁ గాక
పరమకరుణా సముద్రుఁడా పద్మనాభు, డిష్ట కొని పొమ్మటంచు నాకిచ్చె నితని
నక్కటక్కట మిన్ను వడ్డట్టి చోట, నితరులకుఁ బాలుచేసితి నెట్టులొక్కొ. ౩౬.

చ. అహరహ ముంద్రిసంధ్యల మహోత్సులు గొల్వ నయోధ్యఁ జూచు న
ష్టిహపర సాధనం బితని నేఁ గొని పోయెద నీశు వేఁడి నా
గృహమున కంచు గ్రుక్కిళులు మ్రింగుచు నువ్విళులూరుచు న్నదిక
రహిజను నంత సేపయిన రంగఁడు దక్కకపోయె నక్కటా. ౩౭.

ఆ. ప్రాప్తిలేని యప్పుడు పదములకడనున్న, వస్తు వేనిఁ జేతఁ బట్టువడదు
అందరానిపండ్ల కాసించి పొందిన, పగిదిఁ గొంటి నితనిఁ బాయనుంటి. ౩౮.

వ. అని యనేకవిధంబులఁ బరిదేవనంబు సేయుచు రంగనాథు నంతరంగంబునం దిడుకొని కడుఁదడవు వినుతించి యిట్లనియె. ౩౯.

ఉ. ఏమి యుపేక్షచేసితివి ! హీనకులుండును భ్రాతృఘాతి యుం
చేమొ ! మహాపరాధి యని యేమొ ! హరింపఁ బరార్థదారలం
గామమదాదిశత్రువులు గల్గరు నాకుఁ బరాపవాద మే
నేమెయిఁ జేయ స్వప్నమున నేని వచింప నసత్యవాక్యముల్. ౪౦.

వ. అని చింతించు విభీషణునకుఁ బ్రత్యక్షంబై పుండరీకాక్షుం డిట్లనియె. ౪౧.

చ. వివిధగుణైకభూషణ, విభీషణ, వింటివె చూడ నాకు రా
ఘవునకు భేద మింతయును గల్గదు గావున నెన్న సువ్రత
ప్రవరుఁడ వీవు భక్తుఁడవు రక్తుఁడ విట్టి డొకం డొరుండు లే
డవిరళభక్తిసంపదల నస్మదుదీరిత మాదరింపవే, ౪౨.

శా. రక్షోదూషితమైనదేశమున కే రాఁ జాల నిప్పట్లఁ బ్ర
త్యక్షంబై జనకోటి కిచ్చెదను సర్వాభీష్టసంసిద్ధు లీ

వీక్షింపం దగు భాస్కరాయనములందే కేట నేతెంచి యే
మోక్షం బిచ్చెద నీకు నీధనమునం బోనాడుమీ చింతలన్. ౪౩.

క. శ్రీరంగం బనఁగా నీ, ధారుణి నెగడొందు నిచట దర్శనమాత్రన్
క్రూరాత్ములకైనం జే, కూరును భుక్తియును ముక్తి గుణగణశరణా. ౪౪.

వ. నీవు నీపురంబునకుం బోయి సుఖంబుండుము నేను నీకు నెప్పుడుం దోడు నీడనై యుండి సర్వాభీష్టసంసిద్ధియుం జేయుచుండు ననిరంగనాథుం డంతర్ధానంబు నొందె. విభీషణుండును వీతశోకుండై లంక కరిగె. ధర్మవర్మయుం గృతకృత్యుండై యచట సప్తప్రాకారసంయుక్తంబును, మహాప్రాసాదసంయుతంబును, నవరత్నవిరాజితంబును, సువర్ణమయంబు నగునొక్క దివ్యాలయంబు గట్టించి, వివిధాగ్రహారంబు లిచ్చి వేదపారగులగుశ్రోత్రియబ్రాహ్మణుల పూజార్థ మట నిలిపి రంగేశ్వరారాధనంబు గావించుచుండె. అదిమొదలనంతశయనుండు శ్రీరంగశాయియై స్మరణామాత్రంబునఁ బాపుల పాపంబులు దూరంబు సేయుచు నివసించియుండె ననిన విని శౌనకాదులు సూతుం జూచి చంద్రపుష్కరిణీవృత్తాంతంబును రంగనాథమహత్త్వంబునుం జెప్పుమనిన నతండిట్లనియె. ౪౫.

చ. తలచినమాత్రఁ బాపములఁ దగ్గఁగఁ జేసెడు రంగనాథుఁడా
స్థలమహిమంబు దెల్పుటకుఁ జాలరు శూలిముఖాది దేవతల్
తెలియఁగఁ జెప్ప వాడననలే వడియా నయిన న్వచింతు నా
తెలిసినయంత నిక్కముగ దివ్యమునీంద్రులు మీర లల్పులే. ౪౬.

తే. చంద్రపుష్కరిణీజలస్నాన మల్ల, రంగనాయకదర్శనారాధనములు
పూర్వభవసంచితంబగు పుణ్యరాశి, వలనఁ గాని లభింప వెవ్వరికి నైన. ౪౭.

ఆ. పాపాత్ములైనవారికి, నాపట్టున మోక్షమబ్బు నని చెప్పినచో
నేనాటిఫలము గలిగెడు, నోపుణ్యులకెల్లఁగవశ మి యుల్లమునందున్. ౪౮.

క. ఏతన్మాహాత్మ్యంబు దేఁటపడ నొక్కయితిహాసంబు గల దాకర్ణింపుడు. ౪౯.

ఉ. నెలకొలమందు మానికము నీతినిదానము ధర్మసేతుఁడన్
జెలఁగెడు సేలజోఁడు మును జేసితపం బతినిష్ఠ కొన్ని వే
ల్పులు వరచంద్రపుష్కరిణిపొంత ధరాదు లనేకదానముల్
సలిపి స్థలప్రభావమున సన్నతితోఁ జనె విష్ణులోకమున్. ౫౦.

గీ. ఆకాలంబున యజ్ఞవత్సలుఁడను భాఖ్యాతుండు విప్రుండు ది
వ్యాకారుం డతివిజ్ఞుఁడయ్యునిల దుర్వ్యాపారపారీణుఁడై

వీకన్ దుష్కృతు లాచరింపఁగ జను ల్వీక్షించిపొంక్తేయుఁడై
గాకుండ న్వెలిఁబెట్ట నాతఁ డరిగెం గాంతారమార్గంబులన్. ౫౧.

క. అతనిసతి రూపయౌవన, పతినిరత సురతరతయయి వర్తింపుచుఁ దా
నతుకుబడి యొక్క_మాలను, సుతునింగనె వానివలన సుజనాహితునిన్. ౫౨.

వ. అతిక్రూరుండగు నప్పొలక్క_సపుత్త్రుండు. ౫౩.

చ. పురముల్గొల్లుచు గోపురంబులు గుడుల్వ్రచ్చుచు న్నూతులుం
జెఱువుల్ ద్రెంచుచుఁ దోటలున్న ఱుకుచున్ శిష్టాళిఁ దూలించుచుం
దెరువుల్గొట్టుచుఁ గన్నపెట్టుచును గోధేనాదులం బెద్దని
ద్దురఁ జెందించుచు సాధ్వులం జెఱచుచుం దుర్వృత్తిమైవర్తిలున్. ౫౪.

తే. మద్యమాంసరతుండును మార్గరోధ, కుండు శతలక్షకనకహరుండు పాప
రతుఁడు పరవంచకుండు నస్త్రప్రజీవి, బ్రహ్మవిద్వేషణుండు నైపరఁగు వాఁడు. ౫౫.

వ. అన్నరాధముండు నాయకుండై తెఱవకాండ్రును గత్తెఱకాండ్రును జేవాటుకాండ్రును గన్నగాండ్రును లోనగు గడిదొంగల మూకలం గూర్చుకొని పట్టణంబులం బందెపోటువేయుచుం గొల్లలు వెట్టుచు, గన్నపెట్టుచు బాటలంగొట్టుచు మేటిసొమ్ములార్జించుచు జూదంబులాడుచు గల్లుద్రావుచు వేటలాడుచు గంటఁబడిన వానినెల్ల మంటిపాలు గావించుచు సకలప్రాణిలోకాకాలమృత్యుస్వరూపుండై పాపాత్ముండై ప్రవర్తింపుచుండె నక్కా_లంబున. ౫౬.

మ. పుడమిన్ రంగమహోత్సవంబునను సొమ్ముల్ ద్రవ్యితండంబులై
గడగుంపో యనుకింపదంతి కడువేడ్క_ం గర్ణపర్వంబు సే
యుచు నమ్మాలెడు మాలమూకఁగొని చోరోద్యోగ నన్నద్ధుఁడై
నడిచెన్ గాఢతరత్వరంపడు ప్రయాణంబుల్ ప్రవర్తింపఁగన్. ౫౭.

వ ఇట్లు సర్వసాధనసమేతంబుగాఁ గావేరీమధ్యగంబగు చంద్రపుష్కరిణీతీరంబునకుం జని యటనవరత్న ఖచితంబును, హేమజాలవిభూషితంబునగు దివ్యవిమానంబునందు హారకేయూరకిరీటాది నానాలంకారాలంకృతుండగు రంగనాథునింగని తదపహరణేచ్ఛ మనంబునంబొడమి యున్న యదియు కాన మహాత్మ్యండునుంబలె భక్తియుక్తుండై కనంబడి చంద్రపుష్కరిణీ జలంబులాడి స్వామిని సేవించి జనసమ్మర్దంబుడిగి యర్ధమకేయి యగువఱకుం దొంగిల నను వుపడమి నూరకుండవలయుఁ గానఁ బురాణశాలక్షేపంబు చేయువానివలె నభినయించి యభినయించి కావేరీతలంబునం బండుకొని నిద్రపోవు నయ్యవసరంబున. ౫౮.

శా. ద్యావాపృథ్వ్యవకాశ మింతయును లేదన్నట్టు లుప్పొంగి య
క్కావేరీనదియుంచి భృత్యసహితుం గష్టాత్ము నచ్చోరుఁ బా
రావారంబును ముట్టఁగొంచు నరిగెం బ్రాణంబులం బాసి వాఁ
డావారిం దనవారిఁ బాయు శోకచో నాగెం గడుం దెట్టగాన్. ౫౯.

వ. అట్టియెడ దేవదూతలు వచ్చి సదూతంబుగా నతని దివ్యవిమానంబులం బెట్టుకొని దివంబునకుం గొనిపోయిరి. అతఁ డటఁ బెద్దకాలంబుండి సత్యలోకంబునకుం జని సహస్రయుగపర్యంత మచట నిచ్ఛావిహారాదిభోగంబు లనుభవించి వికుంఠంబునకుం బోయి యంతకిబ్బడికాలం బయ్యెడ నధిక విభవంబున నధివసించి తదనంతరంబ ప్రవృద్ధజ్ఞానసంపన్నుండును, ద్వాత్రింశల్లక్షణాన్వితుండును, దేవబ్రాహ్మపూజాతత్పరుండును ధర్మకాముండు నై సోమవంశంబునం బుట్టి సప్తద్వీపసముద్రముద్రిత సర్వసర్వంసహాచక్రైకనాయకుండై విఖ్యాతిం బడసె. అతనిభటులు నతనిమంత్రులై జనియించిరి. జాతిస్మృతియు విష్ణుభక్తియుం గలయుతండు రంగస్వామికిఁ బ్రాకారమంటపాదులం గట్టించి పూజించుచుం గొంతకాలంబునకు ముక్తుండై పునరావృత్తిరహితశాశ్వత పరబ్రహ్మపదంబు నొందె నని మఱియు నిట్లనియె. ౬౦.

చ. తొలుత వరాహకల్పమునఁ దోయజమిత్రుఁ డుమాకళత్రునిం
గొలిచి హరిప్రసాదమునకుం దగిపొల్చెను లోకచక్షువై
చలువలఱేఁడునుం దెలిసి సాఁగు తపంబొనరించి తానునుం
బొలిచెదనంచు నక్కడకుఁబోయి యతవ్రతుఁడై మెలంగుచున్. ౬౧.

చ. కనకనలాడు నిప్పులను గ్రక్కెడు వేసవిఁ బంచవహ్ని మ
ధ్యనిలిచి కాకికాల్లదిపి తర్లఁగనీయనివానకారుఁ జే
లొనరనిబండఁ బండి హిమమొయ్యనఁజిమ్మెడు సీతువేళ నీ
టను దలబంటి మున్గి ప్రకటంబు తపించె మునీంద్రు లెన్నఁగన్. ౬౨.

వ. ఇట్లధిక నిష్ఠాగరిష్ఠుండై తపం బొనరించుచున్న యంత శ్రీవత్సలాంఛనుండు వాత్సల్యంబునం బొడసూపి వత్సా! వరంబు వేఁడుమనుటయుం బ్రసాదంబని చంద్రుం డత్యంత భక్తిసాంద్రుండై సాష్టాంగ నమస్కారంబుగావించి. ౬౩.

శా. నీవే తల్లివి నీవె తండ్రివి కడుం దేలించు చుట్టంబునున్
నీవే తోడును నీడయున్ గురుఁడును న్నీవే సుమిత్రుండునున్
నీవే దైవము నీవె సర్వమనుచు న్నిన్నెక్కని న్నమ్మితిన్
నీవాఁడం జుమి యెట్లు గాంచెదవొ! తండ్రీ భక్తచింతామణీ. ౬౪.

మ. వనమాలీ, వినుమా ఖగోలమగుచు న్వర్తించినంబోట్లు గ
ల్గునుజుమ్మీ తనునమ్మునమ్మగనికిం గ్రూరాత్ముఁడై యీ మహా
మునియొప్పంగనుజెప్ప నిప్పుడిట నీపూఁబోడి స్త్రీచాపలం
బునఁగాదే యిపుడిట్లు నాదు నటనంబుం జూడఁగా నెంచెడుఁ. ౮౧.

తే. ఎంతచెప్పినవినదు మా కాంతదీని, కీతపస్వికి నిపుడైదఁ బ్రీతిగాఁగ
నాట్యమొనరింపవలసెను నాకుఁగాన, సాధనంబుల నెల్ల వేసంతరింపు. ౮౨.

వ. అనినం దానునుం జూడఁ గుతుకపడువాఁడు గాన జనార్దనుండు విశ్వకర్మ నాహ్వానంబుగావించి వానివలన జాంబూనదమయంబును, నానారత్నోపశోభితంబును, శీతాతపవర్జితంబును, సువిశాలంబునగు నొక్క దివ్యరంగంబు నిర్మాణంబుగావించి, తాను పటకియు, శతానందుండు తాళహస్తుండును, నందికేశ్వరుండు మృదంగకారియు, వాణి వీణాపాణియు, తుంబురనారదు లుపగాయకులును, అశ్వనేయులు స్వరజ్ఞులును, హరిహయుండు కాహళియుంగాఁ బరమేశ్వరుండు నర్తకుండై నాట్యంబు గావించుచుండ దాక్షాయణి రంగాధ్యక్షయై శచ్యాదిమహాదేవులు సేవించుచుండ సింహాసనంబునం దధివసించి చూచుచుండె. అయ్యవసరంబున శంకరుండును వివిధంబులగు హస్తపాదవిన్యాసంబులచేతను, భుజదండచలనంబులచేతను, శీర్షోన్నమనాదులచేతను, సమవిషమంబులగు గాత్రయష్టిప్రసారంబులచేతను, విచిత్రభ్రమణంబులచేతను, దశదిగ్విహారంబులచేతను, మనోహరంబులగు నేత్రభంగంబులచేతను, స్వయంకృతగానంబుచేతను, స్వరమూర్ఛాన్వితంబగు షడ్జపంచమయోగంబుచేతను, తాళగానప్రపూరకావధానంబులచేతను, వలయనూపురశింజితంబులచేతను, ముద్రికానిక్వాణంబులచేతను, హారగతాగతరవంబులచేతను, కుండలీకృతఫణిఫణారత్నప్రభాన్వితంబులు మౌళిగంగాజలాన్వితంబులునగు శేఖరీభూతేందుకిరణంబులచేతను సర్వజనమోహనంబు మనోహరంబున దృష్టపూర్వంబునగు నృత్తంబు గావించె. అపుడు హరిపురందరాది బృందారకబృందంబును, పర్వతనారదాదిమునికదంబంబును, బ్రహ్మానందభరితంబై ప్రతిమాచయంబుగతిం గనుపట్టె. గిరీంద్రనందనియును నానందకందళిత హృదయారవిందయై యిందుధరుని గాఢాలింగనంబుచేసికొని బహూకరించె. అతి రమణీయమగుటం జేసి యెల్లరు నట నివాసంబు గావించిరి. గంగాధరునకు నాట్యరంగమగుటచే నది శ్రీరంగంబను పేరనంకితంబయ్యెనని వెండియును. ౮౩.

క. అల శ్రీరంగమునందున, నలరొందెడు జంబుకేశ్వరాహ్వయుఁడు శివుం
డిల నతని చరితమెల్లను, దెలియఁగ వినుపింతు వినుఁడు ధీనిధులారా. ౮౪.

చ. ఘనుఁడు దలకశ్యపద్విజ శిఖామణి మెట్టుచు రాజమార్గమం
దున నొకసెట్టిచే మిగులఁద్రోపడి “కట్టిసగర్వమిట్లుగన్
ధనమదిలేమినాకిటులు దారసమయ్యె మదీయజీవనం
బెనయ నిరర్థకం” బనుచు నేగెఁ ద్యజింపఁగ రంగభూమికిన్. ౮౫.

తే. చంద్రపుష్కరిణీజలస్నానమొలమిఁ, జేసి కాష్ఠములెన్నియోఁ జేర్చి చిచ్చు
వెట్టి యుఱుకంగఁ దలఁచినయట్టివేళ, నటకుఁ జనుదెంచె జంబుకమగుచు వజ్రి. ౮౬.

వ. చనుదెంచి దేహపరిత్యాగంబుసేయనున్న కశ్యపునిం గని యిట్లనియె. ౮౭.

చ. మునివర! ప్రాణమేల నిటుపోవిడనాడ దలంపుసేసి నీ
చనువిధిసృష్టిలోన నరజన్మము శ్రేష్ఠము దానిలోన స
జ్జననము బ్రాహ్మ్యమందుఁ బురుషత్వము దుర్లభమట్టినీవు చా
వును మఱిపుట్టువుం గోరఁదుఁ బోలుసెకో! నరకాకరుండవై. ౮౮.

క. బలవన్మరణము నొందిన, ఖలునిన్ సమవర్తి పట్టి కాఱియ పెట్టున్
గలకాల మంతవాఁడే, యిల నీచక్షేత్రజన్మ లెన్నో నెత్తున్. ౮౯.

క. దేవతలు విప్రులగుటకు, భావంబులఁ గోరుచుంద్రు పరికింపంగా
దేవత్వముకంటెను భూ, దేవత్వము మేలు దానిఁ దిలకింపవొకో. ౯౦.

తే. ధనము లేనట్టి పేద నేననుచు వగచి, పెట్టఁ బ్రాణంబువిడుచుట వెఱ్ఱితనము
చచ్చుతఱిఁ గూడఁ గాసైన వచ్చునయ్య, తలఁచిచూచిన నట్టిదంధనము ధనము. ౯౧.

తే. పట్టరానివారలకాళ్లు పట్టిధనము, ప్రోగువట్టుట సుఃఖంబు పొందుటదాని
దాచుకొనుటంత సుఃఖమ్ము తప్పిజారి, పోయెనేనియు దుఃఖంబు పోనియదియ. ౯౨.

క. ధనమధికమైన మానిసి, ఘనమదమను రోగమెత్తి కనుగానకిలన్
దనయొడలు దానతెలియక, జననిందకుఁ బాత్రుఁడగుచుఁ జనుదుర్గతికిన్. ౯౩.

వ. కావున ధనధారాదికామ్యంబులం దగిలి లేని కారణంబు తెచ్చిపెట్టుకొని యాత్మ
హత్యచేసికొని వెనుక నీచక్షేత్రంబులం బుట్టుటకంటెఁ జచ్చి పుట్టని మోక్షంబునొం
దుట మంచిది యని జ్ఞానోపదేశంబు సేయ నంత నతండఖండవైరాగ్యయుతుండై
యతని శతక్రతునిగా నెఱింగి సాష్టాంగదండప్రణామంబు గావించి పూర్వేచ్ఛం
దొలంగఁ ద్రోచి యిష్టార్థంబులం బొందె. జంబుకరూపధరుండగు నింద్రుండు నచట
నొక శివలింగంబు ప్రతిష్ఠించి స్వర్గంబునకు నిర్గమించె. అది మొదలా శివుండు జం
బుకేశ్వరుండు నాఁబడు. అతని నర్చించి కాశ్యపాదులు ముక్తిం జెందిరకావున

బున శ్రీరంగంబు శివక్షేత్రంబై పార్వతీపరమేశ్వర భూతంబును బ్రమథగణరక్షితంబు
నైయుండె నట్టి సమయంబున. ౯౪.

మ. హరివంచించి హరింపనెంచి మదిలో నాక్షేత్రముఁ వృద్ధభూ
సురవేషంబునుదాల్చి శంభుఁడెడరై చూపట్టునస్థామనో
హరరంగంబున నున్నగౌరికడకుఁ హర్షంబునన్వచ్చి సు
స్వరయుక్తిం బ్రవరంబతెంచి యెఱఁగెఁ సాష్టాంగపాతంబుగఁ. ౯౫.

చ. అటులు నమస్కరింపుచుఁ బ్రియంబులువల్కెడు నమ్మహాత్మునిఁ
స్ఫుటకరుణాన్వితోక్తులఁ బ్రమోదితచిత్తునిఁగా నొనర్చి ధూ
ర్జటిసతి లెమ్ము భూసురవరంబులుగొమ్ము శుభంబుచేకుర
న్గటకట! యెంతకష్టపడి నాకడకీవరుదెంచినాఁడవో. ౯౬.

తే. అనిన నక్కపటాత్ముఁడా హరివచించు, శంకరార్ధాంగివినుము నేశ్రాంతుఁడయితి
బుండరీకపురంబుననుండిరాక, దూరగమనంబు సేయుటఁ దొడరె నిద్ర. ౯౭.

చ. ముదుసలివాఁడ డస్సితిని ముంచుకొనెఁ దగ కూర్కుకంటికిఁ
నదులకడ న్వనాంతరమునఁ శయనింపఁగరాదు క్రోల్పులుల్
వొదలెడునిందునందునను బ్రోవఁ దలంచితి వే నొసంగుమి
ప్పదమున నిద్రవోదుఁ దనవంకన మెల్కువ వచ్చునంతకుఁ. ౯౮

ఉ. ఏరును నన్నులేపవల దీవును నీదుమనోహరుండు నీ
వారును లేచునావరకవశ్య మొకానొకచోఁటికేగి రాఁ
దీరెదు నింతమాత్రమగు దీని నొనర్చి యనుగ్రహింపు మీ
తీరుననున్న నన్నుఁ బరదేశనివాసుని జీర్ణవాసునిఁ. ౯౯.

చ. అనినఁ గృపాతరంగిత మనోంబుజయై జగదంబ శౌరికి
ట్లను ధరణీసురోత్తమ, మహత్వముఁగోరక నన్నునల్ప మి
మ్మనననగునయ్య? నావుడతఁడమ్మరో, నీదయఁగొన్న మాత్రనే
ఘనుఁడనబ్రహ్మముఖ్యులకుఁ గావలియుండెదులచ్చినాకడఁ. ౧౦౦.

వ. నిద్రావశంవదుండనగు నాకు శయనార్థమీరంగస్థలం బొసంగు మింతియచాలు దీన
ననంతసుఖంబనుభవించెద. అనిన నాయుమయు నట్లకా! యని రంగంబతని నిద్ర
కిడి తానుసపరివారంబుగా నెటయేనియుం జనియెనంత జనార్దనుండును. ౧౦౧.

చ. తలకొక కేలులీల నుపధానముగా నొనరించి యొండుకేల్
నిలువున జానువంటనిడి నీలయునేలయు లచ్చిగొల్వఁగా

తెలఁగఁగ శంఖచక్రములు శేషునిపై శయనించిరంగ మం
దలిమిని యోగ నిద్రఁగొనె నెన్నటికి న్విడకుండునట్లుగన్. ౧౦౨.

వ. అయ్యవసరంబున. ౧౦౩.

చ. హరుఁడు సమంగతుండగుచు నాశ్రమమందుభవానిలేమియుం
బురుషుఁడొకం డటన్నిదురవ్రాలుటయుం గని దివ్యదృష్టిచేఁ
బరఁగ నెఱింగి తానగజవంచితయయ్యె నితండు రంగమం
దిరము వశంబుచేసికొని నిద్రితుఁడయ్యెడు మాయకుండయో. ౧౦౪.

వ. వీనియట్లు నేను నాకమలాలయువంచించి వీని కత్యంతప్రియంబగు పుండరీకపురంబు వశంబుచేసికొనియెద ననివృద్ధబ్రాహ్మణపుంగవుండై పుండరీకంబున కరిగి విష్ణుపత్నిం గని నీమగండు నిన్నొంటివిడిచి తాను శ్రీరంగంబునం దధివసించె. నీవటకేగి వానిం బిలిచి తోడుకొనిరమ్ము రాకున్న నీ వటనయుండుము. నీ వచ్చుదనుక నే నిచ్చట న నీ కార్యసిద్ధి నభ్యర్థించి జపంబు సేయుచుండునని బోధించి పుచ్చి తానగజాయుక్తంబుగా వశంబుచేసికొని యచ్చోట నధివసించె. రంగనాయకియు రంగంబునకుం జని రంగనాథునిం గూడి రాదయ్యె. అది మొదలు శివక్షేత్రంబగు శ్రీరంగంబు వైష్ణవంబును విష్ణుక్షేత్రంబగు పుండరీకంబు శైవంబునునై భుక్తిముక్తిప్రదంబులయ్యె. ఈ శ్రీరంగమహాత్మ్యంబు వినువారును జదువువారును సర్వాభీష్టంబులంబడయుదు రనం తరం బుత్తమోత్తంబగు కుంభఘోణక్షేత్రంబుగలదు దాని వృత్తాంతం బెట్టిదనిన.

## కుంభఘోణవృత్తాంతము.

గ. శీతాంశుండొకవేళ శాశ్వతఘనశ్రీకాముఁడై లోక వి
ఖ్యాతంబై తగురంగభూమి నధికాహ్లాదంబునన్ మాధవుం
జేతోవీథిఁ దలంచుచుం దపముగ్రిం జేయంగఁ బ్రత్యక్షమై
యాతం డిష్టము వేఁడుమన్న నతఁ డభ్యర్థించె నైశ్వర్యమున్. ౧౦౬.

తే. అంత హరియును మత్స్యకూర్మాదిరూప, ధరుఁడనై నేను ధరణిపైఁ దిరుగు కతన
నాదు విరహంబుసైఁ పకయాదిలక్ష్మి, కుంభఘోణమునందు నన్గూర్చినిలిచె. ౧౦౭.

వ. నీ వటకుంబోయిన నీకాదేవి విపులైశ్వర్యంబిడుననుచు ద్విజరాజా క్షేత్రరాజం బిచటి కెంతదూరంబుననుండె దాని మహాత్మ్యం బెట్టియది చెప్పుమనిన నప్పుండరీకాక్షుండు వెండియు నిట్లనియె. ౧౦౮.

ఉ. కైరవమిత్ర, నీ విపుడు గన్గొనినా నలక్షేత్రమీడకుం
దూరపుగాఁగ యోజనచతుష్టయమందునఁ గుంభఘోణముక్
ఖేరునఁ బోల్పు మీరునట వెల్గెడులక్ష్మీసరోవరంబు బం
గారుపయోజకాననము గాఁ బురముండెడు దేవి యచ్చోటన్. ౧౦౯.

క. లక్ష్మీసరోవరంబది, లక్ష్మీతపోమహిమవలన లక్షింపఁగనై
లక్ష్మీసంవర్ధనమున, లక్ష్మీ నాశకరమగుచు లలిఁదనరారున్. ౧౧౦.

తే. మున్ను మంగళదేవత పుడమియందుఁ, దనరుగంగాది సర్వతీర్థములు తెచ్చి
చేసె నా సరోవరమందు జేసినట్టిఁ, స్నానసంధ్యాదిక్రియల్ స్వర్గమిచ్చు. ౧౧౧.

ఆ. కుంభఘోణమందుఁ గోరికమెయి సెవ్వఁ, డేన మూఁడు నాఁడులైగ నేని
వాఁడు భూతసంప్లవంబగునందాక, బ్రహ్మలోకమందుఁ బరఁగుచుండు. ౧౧౨.

వ. అన్యక్షేత్రంబులఁ జేసినపాపంబు పుణ్యక్షేత్రంబులయందును, పుణ్యక్షేత్రంబులఁ జేసినపాపంబు వారాణాసియందును, వారాణసియందుఁ జేసినపాపంబు కుంభఘోణంబునందును, కుంభఘోణంబునం జేసినపాపంబు కుంభఘోణంబునందును నశియించు. అచ్చటఁ గుంభేశ్వరుండు సర్వార్థప్రదుండైయుండు నీ వచ్చటికరుగుమని యా మంత్రణంబుచేసి విష్ణుం డంతర్ధానంబు నొందె. సుధాంశుండు నా చెప్పినచొప్పునం జేసి సిద్ధివడసె. సురగురుం డచటఁ దపంబు గావించి మృతసంజీవినీవిద్యంబడసె. మంగళ బుధరాహుకేతువులును, ఇంద్రాది బృందారకులును, హరిశ్చంద్రాది రాజేంద్రులును, తత్ప్రదేశంబున నిష్టార్థంబులం గొనిరి, ఈ చెప్పినతీర్థంబులెల్లఁ గావేరీప్రభావంబునం బ్రసిద్ధంబులయ్యె. ఆసహ్యసాగరాంతంబుగా నక్కావేరి తులామాసంబునందు స్నాన మొనర్చినవారికి మోక్షం బిచ్చుచుండు. అందు మూలస్థానంబగు బ్రహ్మకుండంబునందును, కనకాసంగమంబునందును, కపిలాసంగమంబునందును, హేమావతీసంగమంబునందును, త్రిమకూటంబునందును, గజారణ్యంబునందును, చంద్రపుష్కరిణీతీరంబునందును, గౌరీమయూరసంజ్ఞికంబగు కుంభఘోణంబునందును, తులాస్నానంబు విశేషఫలప్రదంబు. అచ్ఛోదంబును, మానసంబును, బదరీవనతీర్థంబును, నర్మదయు, యమునయు, సరస్వతియు, విశాలయు, జాహ్నవియు, గండకియు, చంద్రభాగయు, తాపినియు, గోదావరియు, కృష్ణవేణియు, పయోష్ణియు, సరయువును, తుంగభద్రయు, మఱియు నెల్లతీర్థంబులును తులామాసంబునం దక్కావేరిం జేరియుండు. అపుడు కావేరిస్నాతలకుఁ గామధేను కల్పకచింతామణీ తుల్యయగు. తులాస్నాయిగాని

వాని జన్మంబు సూర్యుండులేని గగనంబువలెను జంద్రుండులేని రాత్రింబలెను నిరర్థకం బని మఱియును. ౧౧౩.

తే. మధ్యదేశీయ మృగరాజమధ్యయొకత, సహ్యపర్వతమందు వాసంబుచేసి తులనురవి సేరఁ గావేరి నెలదినములు, భక్తిస్నానంబుచేసి కైవల్యమందె. ౧౧౪.

తే. తొల్లి నాఘాఖ్యుఁడును బ్రాణవల్లభయును, వద్యయును గుంభఘోణానవద్యభూమి సహ్యజానదిఁ దులయందు స్నానమాడి, యుభవుకడనిల్చిరోగి గణాధ్యక్షులగుచు.

వ. పిమ్మట మధ్యార్జునేశ్వర ప్రకీర్తితంబును సర్వపాపహరంబునగు మధ్యార్జునక్షేత్రంబు గలదు. తన్మహాత్మ్యంబు సెప్పెద నాకర్ణింపుడు. ౧౧౬

## మధ్యార్జునక్షేత్రమహాత్మ్యము.

తే. కాశికేదారములకంటె ఘనతరంబ, యగుచుఁ దలకొత్తు నల్లమధ్యార్జునంబ నంగనవసరమిటలేదు సాంగముగను, బరఁగుకథవిన్న మీకు మీఁదరయనగును. ౧౧౭.

తే. దేవలోకైకనుతుఁడును దేవమాని, గణనుతుండు దిగీశాగ్రగణ్యుఁ డగుచు నధికవైభవ మేర్పడ నల్ల స్వర్గ, మందు మఘవంతుఁ డలరెడు నవసరమున. ౧౧౮.

వ. మహాబలపరాక్రమసంపన్నుండగు, వృత్రాసురుం డఖిలసేనాసమేతుండై దిగ్విజయం బునకై బయలు వెడలి. ౧౧౯.

సీ. ఇంద్రలోకముఁజేరి యింద్రుని నోడించి యగ్నిలోకముఁ బోయి యగ్నిఁగెలిచి యమలోకమునకేగి యముని వినిర్జించి నిరృతిలోకముగని నిరృతినెడిచి వరుణలోకముఁజని వరుణునిఁ గెరలించి పవనలోకముఁజేరి పవనుఁద్రోలి ధనదలోకముఁజూచి ధనదునిఁదూలించి రుద్రలోకముఁబొంది రుద్రుఁగలసి మరియుఁ బ్రహ్మవిష్ణ్వాదులఁ దిరిగిగెలిచి, తనరనీరేడుజగములు తన వశంబు గాఁగఁ గొనిదివిజేంద్రుండు గండుమిగిలె, ననుచు నచటికి వెండియు నరుగుదెంచి.

వ. అమరావతీ పురద్వారంబు ముట్టడించి లగ్గలువట్టుచుండె నది యంతయునుం గని మునిగణంబు మఘవంతుని చెంతకరిగి త్రిశిరసాగ్రజుండు వృత్రాసురుండు వెండి యుం గండుమిగిలి త్రిశూలధరుండును గ్రోధరక్తాంతలోచనుండును యుద్ధసన్నద్ధుం డునై వచ్చి పురద్వారంబున నపరభాస్కరుండునుంబలె నిలిచియుండె. అని విను పింప నతండును గ్రోధనుదుర్ముఖుండై యైరావణంబధిష్ఠించి ద్వాత్రింశత్కోటిగుణిత దేవతాపరివృతుండై కదలిపోయి లోకకంటకుండగు వానినిం గనియునిట్లనియె.

సీ. పటుతాళఘనరవార్భటిఁ బ్రతిఘటియింప నెక్కులుక నెక్కులు నొక్కినొక్కి
కొండపైఁబైనుండి కొండగూలినపోల్కి బొమ్మునుక బొమ్మను గ్రమ్మిగ్రమ్మి
పెనవెట్టివేయున శ్వేటపగ్గంబనఁ గాళ్లనుంగాళ్లను గట్టికట్టి
దండిజోదులసు దెలాండొంటఁ బడినట్లు ముక్కులుక ముక్కులు పొడిచిపొడిచి
తెగకసవ్యాపసవ్యముల్ దిరిగితిరిగి, పైఁకిగ్రిందికిఁ బేరెము ల్వారిపారి
జట్టిమల్లులగతిఁబోరెఁ బిట్టలపుడు, మాటిమాటికి జాబ్బులు చెవుల్ దూటుగట్ట. ౧౩౫.

క. ఈరీతిని ఘోరంబుగఁ, బోరుచు నాకాశమందుఁ బోఁబోనవి కా
వేరీ సాగరసంగము, జేరంగావచ్చెనొడలు జెమరింపంగన్. ౧౩౬.

వ. ఆ సమయంబున గృధ్రపాతఘాతంబున ఛిద్రీభూతశరీరంబై టిట్టిభంబు కావేరీ సింధు సంగమంబున బడియెఁ బడునప్పుడు శిరంబు శూలప్రాయంబగు నొక్కవృక్షశాఖాగ్రంబునం దగులుకొని నిలిచియుండె. ఆటిట్టిభంబును దత్ప్రభావంబునంజేసి స్వర్గంబనుభవించి వెనుక నాదేశంబునఁ జిత్రకేతుండను రాజై జన్మించె. పూర్వజన్మ స్మృతిగల యా చిత్రకేతుండును నా క్షేత్రంబున కరుదెంచి వృక్షాగ్ర సముపస్థితంబగు పూర్వదేహాశీర్షం బాకర్షించి తత్తీర్థంబులంగలిపి సర్వదేహపతనంబునంజేసి రాజదేహంబుతోడన స్వర్గంబునకు నిర్గమించి సుఖంబుండెనని వెండియును. ౧౩౭.

తే. పలుకులేటికి వేయు నాభవ్యసింధు, సంగమంబున దేహవిసర్జనంబు
సలుపువారికి స్వశరీరకలితమైన, స్వర్గసౌఖ్యమబ్బెడు నాదివాకరముగ. ౧౩౮.

వ. ఇంద్రాది దిక్పాలకులును బ్రహ్మాదిదేవతలును, పార్వత్యాదిదేవులును, ఆశంఖముఖీ తీర్థస్నానప్రభావంబున నిష్టార్థంబులంబొందిరి. అచటి స్నానదానాదులు శతకోటి గుణితఫలప్రదంబులు. ౧౩౯.

క. ఎవ్వఁడు కన్యాదానం, బవ్వరతీర్థంబునందు నాచ్యనకిడునో
యవ్వాఁడు కులముదుర్గతి, కవ్వలఁబోఁబనిచి నిలుచు నజునిపదమునన్. ౧౪౦.

సీ. అటనున్నయిసుకలా లన్నియు నెన్నంగ శంభులింగంబులై సొరుమీఱు
నటనున్నబ్రాహ్మణు లందఱు నెన్నంగ సిద్ధమానీంద్రులై చెలఁగుచుండు
రటనున్నఫలశాఖు లన్నియు నెన్నంగ విబుధాగ్రగణ్యులై వెలయుచుండు
నటనున్నములుచెట్టు లన్నియు నెన్నంగ రాక్షసవీరులై రమణకెక్కు
అచటనున్నట్టి క్రిమికీటకాదులెల్ల, నెన్న స్వర్గనివాసులకంటె నధిక
మగుచుఁ జెలఁగు నాతీర్థమహత్వమెన్న, హరిహరాదులకైన శక్యంబుగాదు. ౧౪౧

క. పాపులకేనియు మోక్షం, బేపారెడు నచట నాడిరే నసుచో ని
ష్పాపులకుఁ గలుగుఫలమది, యీ పాటిది యనఁగవశమె యెవ్వరికైనన్. ౧౪౨.

చ. అనివచియించిన న్విని మహామును లెంతయు సంతసించి సూ
తునిఁగని సహ్యజామహిమతోఁ గల సర్వకథావిశేషముల్
ఘనుఁడవు నీకతంబునను గాదె వినంగలిగెన్ మనంబులుం
దనిసె ఫలంబదేమి వినిన్ ? వినురీతియు నెట్లుచెప్పుమా. ౧౪౩.

వ. అనిన సూతుండు పురాణశ్రవణఫలం బిట్లని చెప్పందొడంగె. ౧౪౪.

మ. కమలాంశన్ జనియించి భూతలమునం గావేరినాఁబోల్చు నా
విమలద్వీపవతిం దలంచినఁ దగన్వీక్షించిన స్పృష్టినన్
గమలంబాడినఁ బాపరాసులడఁగుం గామ్యార్థముల్ దీరుఁ బు
ణ్యము చేకూరుఁ ద్రివిష్టపంబు దొరకున్ మోక్షంబునుం గల్గెడున్. ౧౪౫.

క. ఏతాదృగ్విధమహిమన్, ఖ్యాతిం బొలుపొందినట్టి కావేరికథన్
ఏతటి నెవ్వఁడు వినినను, భూతలమున వాఁడు భుక్తిముక్తుల నొందున్. ౧౪౬.

సీ. శ్రవణంబుసేసెడు జనులు వేఁకువలేచి స్నానసంధ్యాదులు చక్కఁబెట్టి
కుసుమక తమలంబు వడ ముకపసకరా ద్వయంగ సంచనంబు నాచరింప
కాక్షేపణంబులు భూక్షేపణంబులు చిత్తచాంచల్యంబు జేసికొనక
యధికప్రలాపంబు లాచరింపకచాల భక్తినెమ్మనమునఁ బాదుకొలిపి
తగిన పౌరాణికుని వేఁడి దరికిఁదెచ్చి, యున్నతాసనమందుఁ గూర్చుండఁబెట్టి
సత్పురాణంబు శ్రవణంబు సలిపిరేని, భుక్తిముక్తులు గొందురా పుణ్యులిలను. ౧౪౭.

క. ఈ నియమంబులు జేయఁగ, లేనని శ్రవణంబది మొదలే విడనాడం
గా నొప్పదెట్లులైనం, గానీ! సత్కథ వినుట ఘనతరమకదా. ౧౪౮.

వ. ఈ కావేరీ మాహాత్మ్యంబు. ౧౪౯.

మ. శితకంఠుం డొకఁగించె మున్నగజకున్ శీతాద్రిపై యామె స
న్మతితోఁబల్కె వసిష్ఠమౌని కతఁడు వ్యాప్రుచ్చె నాశక్తికా
గతుఁడా తండును నాపరాశరునకుం గల్పించె నాతండు స
న్నుతుఁడై వ్యాసున కొప్పఁజెప్పె నతఁడున్ బోధించె నాకిమ్ములన్. ౧౫౦.

క. మున్నీ పరాశరమునిచేఁ, బన్నుగ విన్నట్టి కుంభభవుఁ డొకఁగింపం
గన్నట్ల వినియె షణ్ముఖుఁ, డున్నగమున నీనదీమహత్వము పేర్మిన్. ౧౫౧.